శ్రీ అరవిందులు

# జగన్నాథుని రథము







అనువాదకులు:

సి. నారాయణ రెడ్డి

# ప్రస్తావన

సృష్టిని గుఱించిన దైవలీలకుగల కారణమేమి యని యెఱింగి, దైవముతో నైక్యమై, దైవమునకు దైవమువలె, ఈ దైవలీలయందు తోడ్పడుచుండుటే మానవుని జీవితోద్దేశ్యమని యీ గ్రంథమునందు శ్రీఅరవిందులు ఐదు వ్యాసములు సర్వులకు తెలియునట్లు సులభశైలిలో వ్రాసియున్నారు.

ఈ ఐదు వ్యాసములును ఈ విషయమునే స్పష్టపఱచినవి. మొదటిది, దైవలీలా విధానము, రెండవది, తన్మార్గమునకు ఆర్యులు అవలంబించిన జీవితపద్ధతి, మూడవది, ఒక జపానుదేశీయుని ప్రత్యక్ష జీవితచరిత్ర, నాల్గవది, తన్మార్గమునకు గల దేవీ ప్రార్థన, ఐదవది, ఈ తత్వమును విశదపఱచు యొక కథ.

— ప్రకాశకులు

# వి ష య సూ చి క





# జగన్నాథుని రథము

మానవ సమాజముయొక్క అంతరాత్మయే, భగవానుని వాహనము. మేల్కొనిన అంతరాత్మతో కూడికొనిన సమాజమే, ఆదర్శ సమాజము. ఈ ఆదర్శసమాజమే జగన్నాథుని యాత్రారథము. ఐక్యము, స్వాధీనత, జ్ఞానము, శక్తి, యివి రథముయొక్క నాలుగు చక్రములు.

మనుష్యబుద్ధిచే, లేక ప్రకృతియొక్క అశుద్ధప్రాణ స్పందన క్రియాశక్తిచే నిర్మింపబడిన సమాజము వేఱు పద్ధతిని కలదై యుండును. అట్టి సమాజము భగవానునిరథము కాదు. కాని, అది ముక్త్యాంతర్యామిని ఆచ్ఛాదిత మొనర్చునట్టియు, బహురూపిదైవమగు భగవత్ప్రేరణను వికృతమొనర్చునట్టియు నగు సమిష్టిగత-అహంకార వాహనమై యుండును. అది అనేక ప్రకారములైన భోగపూర్ణము, లక్ష్యహీనమునగు కర్మమార్గములందు, అసిద్ధ-అపూర్ణ సంకల్ప వేగముచే, ప్రాచీన లేక

నవీన నిమ్నప్రకృతియొక్క శక్తికి లోనై నడచుచుండును. ఎంత వఱకు అహంకారము కర్తయైయుండునో, అంతవఱకు ప్రకృతి లక్ష్య మును అనుసంధానము చేయుట అసంభవము; మఱియు, ఒకవేళ లక్ష్యముయొక్క మార్గము గమనింపబడినను, రథము నా దిశకు చక్కగా తీసికొనిపోవుట అసాధ్యముగ నుండును. భాగవతప్రేరణను ముఖ్యముగా అడ్డుపెట్టునది అహంకారము; ఈ విషయము వ్యక్తికి యెట్లు అన్వయించునో, అట్లే సమష్టికికూడ అన్వయించును.

సామాన్య మానవసమాజ మనెడిరథము ముఖ్యముగా మూడు విధములుగ నుండును. మొదటిది నిపుణకర్తచే ఉజ్జ్వల-నిర్మల ప్రకాశముగ సృష్టింపబడిన రథము; దీనిని సుశిక్షితములు శక్తిమంత ములు నగు అశ్వములు చక్కని మార్గమునందు యత్నపూర్వకముగా ధీరత్వముతో వేగముగ లాగుచుండును. సాత్వికాహంత ఈ రథము నకు స్వామియై, అందున స్వారి చేయుచుండును. ఉన్నత ప్రదేశమం దుపస్థితమైయుండు భగవానుని మందిరము చుట్టు ప్రదక్షిణముగ నీ రథము తిరుగుచుండును. కాని యీ రథము భగవానుని మందిరము నకు కొంత దూరముగనుండి మాత్రమే తిరుగుచు, నా యున్నతభూమికి సమీపమున కొక్కసారిగా రాజాలకుండును. రథమునందలి తన స్థానమునుండి అతడు పైకిపోవ నిచ్ఛగించెనేని, ఆ రథమునుండి దిగి కాలినడక నడువవలసిన నియమ మాతని కున్నది. వేదయుగము తర్వాతగల ప్రాచీన ఆర్యజాతి సమాజము, ఇట్టి రథమని చెప్పనగును.

రెండవవిధ రథము, విలాసకర్మరుని మోటారుబండి వంటిది. ఇది ధూళిని లేపుచు భీమవేగముచే గర్జనచేయుచు దారియందు ధమధమ శబ్దముచేయుచు, అశాంత — అశ్రాంతగతిచే పరుగిడుచు నుండును. మఱియు దీని భోంభోం శబ్దముచే నిది మానవుల చెవులను బ్రద్దలు చేయుచు, ఎదుట తటస్థపడినవారి మీదనడచుచు గాయపఱచుచు పరుగిడు చుండును. ఈ రథికుని ప్రాణమునకు అపాయదుర్ఘటనలు కలుగునవ కాశము అనవరతము యుండును. మోటారుబండి విరిగెనేని దానిని బాగుచేసికొని మరల నదే విధముగా గర్వముచే పాటించును. అతని కేదియు నిర్దిష్టలక్ష్యమనునది లేదు. కాని ఎవ్వరైనను, నూతన దృక్ప థము కలవా రతనియెదుట పడిరేని, రాజసికాహంకారముగల నా త డు “అది యాలక్ష్యము, అదియాలక్ష్యము” అని అఱచుచు కేకలు వేయుచు వానిదిశకు పరుగిడును. ఈ రథమునందు పోవుటవలన సుఖభోగములు యథేష్టముగ కలుగుచుండును; అట్లే అనివార్యమైన విపత్తులును కలుగు చుండును. కాని భగవానుని సమీపమున కతడు అరుదెంచుట అసంభ వము. ఆధునిక పాశ్చాత్య సమాజము ఈ విధమైన మోటరుబండి వంటిది.

మూడవది, తాబేలువలె మెల్లన నడువగల సగము విరిగిన, ప్రాత మలినపు పెద్దుబండి. ఆహారములేని, సగము ప్రాణముగల, వల్చని చిక్కిపోయిన ఎద్దు లాబండిని పల్లెటూరి యిరుకుదారియందు లాగుచుం డును. చినిగిన మురికిగుడ్డలను ధరించిన ముసలివాడందులో కూర్చుండి

బురదతో నిండిన హుక్కానుండి పొగ పీల్చుచుండును; బండియొక్క కఠోర శబ్దమునకు, అతీతమైన వికృతభావపు టర్ధస్మృతియం దతడు నిమగ్నుడై యుండును. రథముయొక్క యజమానుని పేరు తామసికాహంకారము. బండి తోలువాని పేరు "పుస్తక జ్ఞానము". ఏ కాలమున నం దేదిశకు పోవలసినది పంచాంగమును చూచి చూచి నిర్ణయించుచుండును. అత డెల్లప్పుడు, ఈ వాక్యమును పలుకుచుండును. "ఏది ఉన్నదో, అది యుండెను; అదియే మంచిది, మఱియు దేనిని కోరి చేయవలయునో, అదియే చెడ్డది." ఈ రథము భగవానుని సమీపమునకు పోవుటకు నిష్టపడదు. కాని శూన్య బ్రహ్మమును త్వరగా చేర నాశించును.

తామసికాహంకారియొక్క ఎద్దుబం డెంతవఱకు పల్లెటూరి బాటయందు మాత్రమే నడుచుచుండునో, అంతవఱకు దాని క్షేమమునకు భంగములేదు. అతివేగముతో పరుగిడు మోటారుబండ్లు నడచునట్టి జగత్తుయొక్క రాజబాట నా యెద్దులబండి యేనాడు ప్రవేశించునో, ఆ నాడు దానిగతి యేమగునో తలంచుటకు గూడ అతనికి భయమగును. ఎద్దుబండిని నిలుపుకొనవలయునా, లేక మార్చవలయునా యను కష్టసమస్యను గుర్తెఱుంగుట, తామసికాహంకారి జ్ఞానశక్తికి మించిన పని. అట్టి సమస్యకు తగిన సమయమును గుర్తెఱుంగుటయు అతని ప్రవృత్తి కాదు. అట్లు గుర్తెఱుంగుట అతని స్వామిత్వమునకు వ్యవసాయత్వమునకు భంగమని అతడు తలంచును, మరే సమస్య లుదయించినను, ఆ

రథ యాత్రికులలో కొందఱు, వానిని గుఱించి ఆలోచించకయే యైనను, "ఉండనిమ్ము, ఉండనిమ్ము; ఇదియే బాగున్నది. ఎందుకన, నిది మాలో నెవ్వరికో యొక్కరికైన సంబంధించి యున్నది; దానిని మేము వదలు కొనము," అని అఱచెదరు. ఈ ప్రజలు కేవల మాచార తత్పరులో, లేక భావావేశపరులో యైయుందురు. వీరిలో కొందఱు, "అక్కడక్కడ రిపేరీ వగైరా చేసికొనగలము," అని చెప్పెదరు. దానియొక్క సహజ ఉపాయము చేతనే, ఎద్దుబండి స్వయముగా అనింద్య-అమూల్య మోటారు బండిగా పరిణతి పొందునని వీరి భావము. వీరినే సంస్కర్తలు అని చెప్పనగును. ఈ తామసికాహంకార సంఘములో మరికొందఱు "దీనిని ప్రాచీన కాలపు సౌందర్య రథముగా మార్చవచ్చును" అని చెప్పుదురు. ఈ అసాధ్యమును కవసరమగు సాధనోపాయమును కనుగొను మధ్య మధ్య ప్రయత్నింతురు. కాని ఆకాంక్షను అనుసరించియే ఫలము కలుగు చుండును కదా! అట్టి ఫల లక్షణములతో కూడిన ఆకాంక్ష లేవియు వీరి ప్రయత్నములందు కనబడవు.

ఈ మూడింటిలో దేనినో యొకదానిని మన మిష్టపడుట అని వార్య మయ్యెనేని, వీనిలో నున్నతతరమైన సాత్వికాహంకార రథమును స్వీకరించి, జీవితమునకు నూతన నిర్మాణము కలిగించుట యుక్తసంగ తమై యుండును. కాని ఎంతవఱకు జగన్నాథుని రథము సృష్టికాదో, అంతవఱకు, ఆదర్శ సమాజము నిర్మాణము కాదు. జగన్నాథుని యాత్రా రథమే మన ఆదర్శము, మన చరమ ప్రాప్తి, మన ఉన్నతతమసత్యము

యొక్క వికాసము, మఱియు దానియొక్క ప్రకృతి. గుప్త విశ్వపురు షుని ప్రేరణచే, అట్టి జగన్నాథుని యాత్రారథ సూచక ఆదర్శసమాజ మును నిర్మింపసాధించుట మానవజాతి యొక్క సత్యాచరణ విధియై యున్నది. కాని ప్రకృతియొక్క అజ్ఞానమునకు వశమయ్యెదమేని ఆదర్శ సమాజమునకు బదులు వేఱువిధమైన వికృతరూప సమాజమును నిర్మింతుము; అది కుత్సితము అసిద్ధమునై యుండును. జన సమ్మతమయ్యె నేవి, కనీస మది అర్థసుందర మైనదిగనైన యుండనగును; ఒకవేళ సౌందర్య యుక్తముగానే యుండెనేని అసంపూర్ణముగనైన యుండును. శివ స్వరూపమునకు బదులు వానర స్వరూపము నిర్మాణమగును; లేదా, రాక్షస స్వరూపమో, లేక మధ్యలోక నివాసియగు అర్ధదేవతయొక్క స్వరూపమో నిర్మాణమగును.

జగన్నాథుని రథముయొక్క నిజమైన ఆకృతిని లేక పద్ధతిని ఎవ్వరును సరిగా నింతవఱకు తెలిసికొనలేదు. ఎవ్వడేని జీవన-శిల్పి ఎంతటి నిపుణుడై యుండియైన, దెలిసికొన ప్రయత్నించినను, ఆ రథముయొక్క పద్ధతిని గ్రహించలేడు, అది విశ్వరూప హృదయము నందుపస్థితమై యున్నది. కాని, నానా ఆవరణములనుండి అది ఆవృతమై యున్నది. భగవానుని ద్రష్టయు కర్తయు నగు నొక దివ్యపురుషుని యొక్కయు, మఱియు అనేక విభూతులయొక్కయు చేష్టలద్వారా మెల్ల మెల్లగ బహిర్గతమై స్థూల జగత్తునందు అది ప్రతిష్ఠింపబడుట అంత ర్యామియొక్క అభిసంధియై యున్నది.

జగన్నాథుని రథముయొక్క నిజమైన నామము సమాజము కాదు; అదియొక ఆదర్శ ప్రజ. ఇప్పటి బహుముఖ శిధిల జనసంఘము లేక జనత, జగన్నాథుని రథముకాదు. ఆత్మజ్ఞానముచే, భాగవత జ్ఞానముచే, పరిపూర్ణ-ఏక ముఖశక్తిచే, ఆనంద పూర్వకముగ నిర్మింపబడిన బంధ రహితమైన అచ్ఛేద్యమైన భాగవత సంఘమును జగన్నాథుని రథము అని చెప్పనగును.

ఏకత్రముగా చేయబడు కర్మకొఱకు, అనేక మనుష్యుల కూడి కచే నేర్పడు సాధన స్వరూపము, సమాజమను పేరుతో చెప్పబడి యున్నది. శబ్దోత్పత్తిని పట్టికూడ, ఆ పదమున కర్థము అదియే యని తెలిసికొననగును. సమ అను ప్రత్యయముయొక్క అర్థము, ఏకత్రత; అజ్ ధాతువుయొక్క అర్థము గమనము, ధావనము, యుద్ధము. అధిక సంఖ్యాకులగు మనుష్యులు కర్మకొఱకును, కామన పరిపూర్తి కొఱకును కలసికొని, ఒకే క్షేత్రమునందు నానాప్రకారములుగానుండి ఒకే లక్ష్యము దిశకు పరుగిడుచు, అన్యసమాజములందు గల స్పర్ధనుగమనించి తమలో తాముకూడ అట్టిది కలిగి, ఒకరికంటె మఱొకరు ముందుకు పోవలయు నను నాశ కలిగి అన్యోన్య విరుద్ధములు కలిగియు, ఇట్టి కోలాహలము నందు బంధనకును సాహాయ్యతకును, అట్లే మనోవృత్తియొక్క చరి తార్థతకును అనేక ప్రకారములైన సంబంధములను కలిగి, అనేక ప్రకా రములైన ఆదర్శములను ప్రతిష్ఠించుకొనుటచే కలుగు నొక ఫల

స్వరూప-కష్టసిద్ధ-అసంపూర్ణ-అస్థిర వ్యవస్థను సమాజ మందురు, ఇదియే ప్రాకృత సంసారముయొక్క స్వరూపము.

భేదమే, ప్రాకృత సమాజముయొక్క పునాది. ఈ భేదము పైననే, దాని ఆంశిక-అనిశ్చిత-అస్థాయిక-ఐక్యత నిర్మింప బడినది. కాని ఆదర్శ సమాజముయొక్క నిర్మాణము దీని స్వభావమునకు విరుద్ధముగ నుండును. ఆదర్శ సమాజముయొక్క పునాది, ఐక్యత; మఱియు నేది పార్థిక్యలీల యగునో, అది ఆనంద వైపరీత్యము కొఱకు ఐక్యమునందు కలదు కాని, భేదమునందు కాదు. సమాజము మనకు శారీరక మనఃకల్పిక కర్మగత ఐక్యతయొక్క ఆనందమును పొందుటకు కారణమగును; కాని సంఘమునకు ప్రాణము, ముఖ్యముగా ఆత్మోప లబ్ధిచే నేర్పడు ఏకత్వమే.

సంకీర్ణ క్షేత్రమునందు ఆశింక సత్య స్వరూపముతో సంఘమును స్థాపించు కార్యము కొన్నిసార్లు జరిగియు నిష్ఫల మొందినది. అది అట్లే జరుగుచుండును. ఏలన, అది బుద్ధి గత చింతనయొక్క ప్రేరణచే నిర్మింపబడును. అట్టిదే పాశ్చాత్య దేశ సంఘముల నిర్మాణము, అట్లు కాదేని, అది నిర్వాణోన్ముఖ కర్మవిరతి పద్ధతిని అనుశీలితముగ స్వచ్ఛందముగ అవలంబించినది. ఇట్టి దానినే ప్రథమ క్రైస్తవ సంఘము అవలంబించినది. కాని అల్పకాలానంతరము, సమాజము నందలి అపూర్ణ ప్రవృత్తి దోషములు సంఘమునందు ప్రవేశించి, సమాజమును మలిన

పడుచును. చంచలబుద్ధియొక్క చింతనలు నిలుకడ చెందక. అవి ప్రాచీనమో, లేక నవీనమో యైనను, ప్రాణప్రవృత్తుల అదమ్య స్రోతమునందు కలిసిపోవును. భావావేగముల శక్తిలోపముచే, సద్భావములు సఫలిత నొందజాలవు. భావము, దానికి గల ఉగ్రతయొక్క కారణముచేతనే, శాంతిని పొందుచున్నది. నిర్వాణమును ప్రత్యేకముగా సంపాదింప ప్రయత్నించుట మంచిదే; కాని నిర్వాణ ప్రేమికుల సంఘమును సృష్టించుట యొక విపరీత విషయము. సంఘము స్వాభావికముగా కర్మకు సంబంధించిన లీలాభూమియై యున్నది.

సమష్టిగత విరాట్పురుషుని ఇచ్ఛాశక్తియొక్క ప్రేరణచే జ్ఞాన కర్మ భక్తిభావముల సామంజస్యత,ఏకీకరణముద్వారా ఆత్మగత యైక్యము ద్వారా యేనా డుదయించునో, ఆనాడు జగన్నాథుని రథము బాహ్యమునం దావిర్భూతమై దశదిశలయందు ప్రకాశించును. ఆనాడు పృథ్వీవక్షమునందు సత్యయుగ మేతెంచును; మర్త్య మనుష్యులయొక్క పృధ్వి. దేవతల లీలా శిబిరముగ, భగవానుని మందిర నగరముగ, ఆనందపురిగ మారును.

*
* *

# ఆర్యుని ఆదర్శము - గుణత్రయము

"కారాగృహము—స్వాధీనత" అను శీర్షిక గల వ్యాసమునందు, నిరపరాధ ఖైదీలైన కొందఱి మానసిక భావమును వర్ణించి, యిట్లు ప్రతిపాదన చేసియుంటిని. ఆర్యశిక్షణయొక్క స్వాభావిక శక్తిచేత జైలు నందుకూడ, భారతవాసులయొక్క ఆంతరిక స్వాధీనతారూప బహుమూల్య పైత్మిక సంపత్తి నశించకుండ యుండుటయే గాక ఘోరాపరాధుల మధ్యకూడ వేల సంవత్సరముల నుండి సంచితమైన ఆర్యచారిత్రక దేవభావము భగ్నావశిష్ట రూపమున నింకను నిలిచి యున్నది. ఆర్యశిక్షయొక్క మూలమంత్రము సాత్విక భావము. సాత్వికమేదియో అది శుద్ధము. సాధారణముగ మనుష్యమాత్రు డశుద్ధుడు, రజోగుణము ప్రాబల్యమగుటచేతను తమో గుణాంధకారము వ్యాపించుట చేతను మానవుని యందు ఈ అశుద్ధము పరిపుష్టియై వృద్ధియగును. మనస్సుకు మలినము రెండు విధముల కలుగుచుండును. మొదటిది, తమోగుణముచే ఉత్పన్నమగు జడత, లేక అప్రవృత్తి జనిత మాలిన్యము, మరి రెండవది ఉత్తేజనము, లేక కుప్రవృత్తి జనిత మాలిన్యము; ఇది రజోగుణముచే ఉత్పన్నమగుచున్నది; తమోగుణ లక్షణములు, అజ్ఞానము, మోహము, బౌద్ధిక స్థూలత, చింతనా అసంలగ్నత, ఆలస్యము, అతినిద్ర, కర్మయందు ఆలస్యజనిత విరక్తి, నిరాశ, విషాదము, భయము, ఒక మాటలో చెప్పెదమేని, నిశ్చేష్టతను పోషించునట్టి గుణములన్నియు

అజ్ఞానముయొక్క ఫలితములు జడతా ప్రవృత్తులు. మరి కుప్రవృత్తి భ్రాంత జ్ఞానమునుండి నుత్పన్నమైనది ఉత్తేజనము. కాని తమోగుణ మాలిన్యము నడగించవలెనేని, రజోగుణోద్రేకముచే సాధ్యమగును. రజోగుణము ప్రవృత్తి కారణముచే కలుగుచున్నది. మఱియు ప్రవృత్తి, నివృత్తియొక్క పూర్వపు సోపానము. జడము నివృత్తికాదు; ఏలయన జడభావము జ్ఞానశూన్యము; మఱి నివృత్తియో జ్ఞానమార్గము. కామనా శూన్యుడై కర్మయందు ప్రవృత్తు డగుటయే నివృత్తి; కర్మను వదలుట, నివృత్తి కాదు. అందుచేతనే, భారతదేశముయొక్క ఘోర తామసి కావస్థను జూచి, "భారతదేశమునకు, రజోగుణము ఆవశ్యకము, కర్మ వీరు లావశ్యకము, ప్రవృత్తియొక్క ప్రచండ స్రోతము ప్రవహించ వలెను; ఇట్లగుటచే పాపము ప్రవేశించినను తామసిక నిశ్చేష్టతకంటె వెయ్యంతలు మేలగును.'' అని స్వామి వివేకానందుడు వచించెను.

నిజముగా, మనము ఘోర తమస్సునందు నిమగ్నులమై యుండియు, సత్వగుణ రహితులమై యుండియు మహా సాత్వికమును ధరించి నట్లు నటించుచు బడాయిగా తిరుగుచుందుము. మఱియు, మనము సాత్వికుల మగుట చేతనే, రాజసిక జాతులచే పరాజితులమై, యిప్పటి అవనతిని బొంది, అతఃపతిత దశకు వచ్చితిమని అనేకులు నమ్ముచున్నారు, వీరిట్టి యుక్తులచేతనే, క్రైస్తవ ధర్మముకంటె, హిందూ ధర్మము శ్రేష్ఠమైనదని ప్రమాణీత మొనర్చుచున్నారు. కాని క్రైస్తవులు ప్రత్యక్ష ఫలవాదులు; వీరు మతధర్మముయొక్క ఐహికఫలమును జూచి మత

ధర్మముయొక్క శ్రేష్ఠత్వమును ప్రతిపాదించుచున్నారు. వారి అభిప్రాయానుసారము వారిజాతి జగత్తునందు ప్రబలముగలదై యున్నదనియు. అందుచే వారు క్రైస్తవ ధర్మము ప్రపంచముయొక్క శ్రేష్ఠ మత ధర్మమని తలంతురు. ఐనను, మనలో అనేకులకు ఈ ఉపదేశము వట్టిభ్రమ యని నమ్మకము. మన వీరి మతానుసారము, ధర్మముయొక్క శ్రేష్ఠతను నిర్ణయించుటలో ఐహికఫలమును పట్టి చేయకూడదనియు, ధర్మముయొక్క పారలౌకిక ఫలమునుపట్టి చేయవలయుననియు చెప్పుదురు. హిందూజాతి అధిక ధార్మిక స్వభావము కలది; అందుచేత అసురప్రకృతిగల బలమైన పాశ్చాత్యజాతి కాధీనమైనది, అని వీరి భావము. కాని. ఈ యుక్తికి వెనుక ఘోర భ్రమ యొకటి కలదు; అది ఆర్యజ్ఞానమునకు విరుద్ధమైనది. సత్వగుణ మెప్పుడును, అవనతి కారణమును పొందజాలదు. సత్వప్రధాన జాతిని దాసత్వ శృంఖలమునం దెప్పుడును బంధింపజాలము. సత్వగుణముయొక్క ముఖ్యఫలము బ్రహ్మతేజస్సు: మఱియు బ్రహ్మతేజస్సు, క్షాత్రతేజస్సుకు పునాది; శాంతబ్రహ్మ తేజస్సుకు ఆఘాతములు కలుగుటచే, క్షాత్రతేజస్సుయొక్క స్ఫులింగములు బయల్వెడలి నాలుగు దిశలయందు ప్రజ్వలితములై లేచును. బ్రహ్మతేజము లేనిచోట క్షాత్రతేజస్సు స్థిరపడదు. దేశమునందు సచ్చారిత్ర బ్రాహ్మణు డొక్కడుండెనేని అక్కడ నూరుగుర క్షత్రియుల సృష్టికి కారణమగును. దేశముయొక్క అవనతికి కారణము సత్వగుణాధిక్యత కాదు, కాని రజోగుణము అభావమగుటచేతను, తమోగుణము ప్రాధాన్యమగుటచేతను ఆ యవనతికి గారణము. రజోగుణము అభావమగుటకు

కారణము మనయం దంతర్నిహితమగు సత్వగుణము మ్లానమై తమము నందు దాచుకొనుటయే. ఆలస్యము, మోహము, అజ్ఞానము, అప్రవృత్తి నిరాశా విషాద నిశ్చేష్టతలు పరస్పరము కూడి దేశమును దుర్దశ—అవ నతి యందు ప్రవేశింప జేసినవి. ఈ తామసిక మేఘము ప్రారంభమున మందగమనముగను విరలముగను యుండెను కాని, కాలగతిచే క్రమ ముగా నింత యధిక నిబిడముగ మారెను. అజ్ఞానాంధ కారములందు మునిగి నిశ్చేష్టులమై. మహత్వాకాంక్ష నుండి విముఖులమై యుండుటచే, భగవంతుని ప్రేరణచే మహాపురుషు లుదయించినను, వారి శక్తియు నా అంధకారమును దూరము చేయలేకపోయెను. ఈ తమో గుణస్థితి కలిగి నంతనే సూర్యభగవానుడు రజోగుణ జనిత ప్రవృత్తి ద్వారా దేశసంర క్షణ సంకల్పమును స్వీకరించెను.

జాగరిత రజోశక్తియొక్క ప్రచండ రూపము కార్యశీల మైనం తనే తమస్సు పలాయనోద్యత మయ్యెను; కాని మరియొక ప్రక్కనుండి స్వేచ్ఛాచారము, కుప్రవృత్తి, ఉద్దామ ఉచ్ఛృంఖలతా ప్రభృతి అసుర భావములు ప్రవేశించు అపాయము కలుగు పరిస్థితి యేర్పడెను. రజో శక్తి తన స్వప్రేరణ చేతనే, ఉన్మత్త విశాల ప్రవృత్తియొక్క పోష ణను మాత్రమే లక్ష్యముగా నుంచుకొని కార్యములు చేయునెడల, పై చెప్పిన అపాయము యథేష్టముగా ఉత్పన్న మగుటకు కారణమగును. ఉచ్ఛృంఖల భావముచే స్వపథగామి అయ్యేనేని, రజోగుణము చాల కాలము నిలుకడగ యుండలేదు; దానియందు శ్రాంతి తమస్సులు కలు

గును. ఇది, ప్రచండ తుపాను వీచిన తర్వాత ఆకాశము నిర్మలము పరిష్కృతము కాక, మేఘాచ్ఛన్నమై వాయుస్పందన రహితమైనట్లుగ నుండును. ఫ్రాంసులో రాష్ట్ర విప్లవము తర్వాత, యిట్టి స్థితియే కలిగెను; ఈ రాష్ట్ర విప్లవమునందు రజోగుణ ప్రాదుర్భావము చూపట్టెను. కాని విప్లవాంతమున తామసిక గుణము అధికముగ పునరుద్ధానమయ్యెను; మఱల విప్లవము మఱల శ్రాంతి, శక్తిహీనత, నైతిక అవనతి.——యిది గత నూరు సంవత్సరములనుండి ఫ్రాంసుయొక్క యితిహాసము. ఎన్నిసార్లు సామ్య-మైత్రి-స్వాధీనతా రూపియు, ఆదర్శ జనితయు నగు సాత్త్వికప్రేరణ ఫ్రాంసు ప్రాణిక చేతనయందు జాగరితమయ్యెనో, బహుశా అన్నిసారులుకూడ రజోగుణము ప్రబలమై సత్యసేవా విముఖ అసురీభావముగ పరిణమించి, స్వప్రవృత్తిని పూర్ణ మొనరించుటకు సచేష్టితమయ్యెను. అందుచే తమోగుణావిర్భావము కలుగుటయు, ఫ్రాంసు తన పూర్వ సంచిత మహాశక్తిని పోగొట్టుకొని మ్రియమాణ విషమావస్థయందు త్రిశంకుని భంగి స్వర్గములేక మర్త్యములేక మధ్యభాగమున తగులుకొనెను. ఇట్టి పరిణతినుండి సంరక్షింపబడుటకు గల ఉపాయ మొకటి కలదు. అది ప్రబల రజోశక్తిని సత్త్వశక్తి సేవయందు వినియోగించుట. సాత్త్వికభావము జాగరితమై రాజసశక్తిని పరిచాలన మొనర్చెనేని తమోగుణ పునఃప్రాదుర్భావమగునను భయము తొలగును. మఱియు ఉద్దామశక్తి శృంఖలితమై, నియంత్రితమై ఉచ్చాదర్శములచే సంచాలితమై మానవజాతియొక్క హితము సాధింపబడును. సత్త్వవృద్ధికి సాధనము, ధర్మభావము; స్వార్థమును ముంచివైచి పర

మార్థ సాధన మందు సమస్త జీవితమును నొక మహాపవిత్ర యజ్ఞము నందు పరిణమింప చేయవలయును. గీత చెప్పినట్లుగా సత్వము రజస్సుతో కలిసిన, తమస్సును నాశనము చేయగలుగును గాని ప్రత్యేకముగా సత్వము మాత్రమే ఆ కార్యమును నెరవేర్చలేదు. అందుచేత భగవానుని ప్రస్తుత ధర్మమును పునరుద్ధానముచేసి, మన అంతర్నిహిత సత్వమును మేల్కొలిపి దాని తర్వాత రజోశక్తియొక్క సంచారమును సమస్త దేశమునందు కలుగచేయవలెను. రామమోహనరాయడు మొదలగు ధర్మోపదేశ మహాత్మగణము సత్యమును పునరుద్దీపనచేసి, నవయుగ ప్రవర్తనము కలిగించిరి. 19-వ శతాబ్దమున మతధర్మ జగత్తునందు కలిగినంతటి జాగృతి, రాజకీయ జగత్తునందు భారతదేశమున కలుగలేదు. ప్రస్తుత మందుకు తగిన క్షేత్రము లేకుండుటయే అందులకు గారణము, అంతేగాక, ప్రచార క్షేత్రమునందు బీజము నాటబడినను అంకురము మొలవలేదు. భారతవర్షముపై భగవానుని దయాప్రసన్నత లుండు కారణముగనే, యిది యిట్లు సంభవించెను. రాజసిక భావముచే ఉత్పన్నమైన జాగరణ మెప్పుడును స్థాయినిపొంది పూర్ణ కల్యాణప్రదము కానేరదు. 1906-వ సంవత్సరమున వికాసము పొందిన రాజసిక శక్తి సత్వయుక్తమైనది, అందుచేత నా ఉద్యమము నందు, చూపెట్టిన ఉద్దామభావము అపాయమునకు విశేష కారణముగ నేర్పడదు, ఏలన, అది రజస్సత్వములయొక్క లీల; ఆ లీలయందు ఉద్దామము లేక అచ్ఛృంఖల భావము కొద్దిగా నున్నను, అదియును శీఘ్రముగ నియమితమై శృంఖలితమై మాయమగును. ఎట్టి బాహ్య

శక్తిచేతను నియమితము కాజాలని రాజసిక శక్తి, జాగరితమై ఆనంద శక్తియగు బ్రహ్మతేజస్సాత్విక భావముల ద్వారా నియమితము కాన గును, ధర్మభావమునకు ప్రచారము చేయుటచే బ్రహ్మతేజమును సాత్విక భావమును పోషింపచేసికొనగలము.

పైన చెప్పబడినట్లు పదార్థమునందు సమస్త శక్తులను వినియోగించుట, సత్వోద్రేకముయొక్క యొక ఉపాయము; మఱియు మన రాజకీయ నైతిక జాగృతియందు యీ భావము యధేష్టముగ పరిమాణము పొందగలుగుచున్నది. కాని ఈ భావమును సంరక్షించుకొనుట మహా కష్టము, ఈ విషయమును వ్యక్తి సాధించుట కష్టమే; మఱియు జాతి సమష్టిగా సాధించుట కష్టతరము. పదార్థమున కాంతరమున స్వార్థము, అలక్ష్యభావముచే ప్రవేశించును. మఱియు మన బుద్ధి పరిశుద్ధము కాని యెడల భ్రమచే పదార్థము పేరుచెప్పి స్వార్థమున కాశ్రయమిచ్చి పర హిత దేశహిత మనుష్యజాతి హితముల ముంచివైచి, మన భ్రమ యే స్థలమునుండి చరించునదియు తెలిసికొనజాలము. సత్వోద్రేకముయొక్క రెండవ ఉపాయము భగవంతుని సేవ; కాని ఈ మార్గమునందుకూడ విపరీత పరిణామము కలుగవచ్చును. భగవత్సాన్నిధ్య రూపకానందమును ఉపలబ్ధి పొందుటచేత మనయందు సాత్విక నిశ్చేష్టతా ప్రాదుర్భావము కలుగవచ్చును. అందుచే ఆ యానందమును భోగానుభవముచే పొందుచు పొందుచు, ఈ దుఃఖ కాతర ప్రపంచమును గుఱించియు, మఱియు మానవజాతి సేవను గుఱించియు ఉదాసీనుల మగుదుము. ఇదియును

సాత్త్విక భావముయొక్క బంధనమే. రాజసికాహంకార మెట్టిదో, సాత్త్వికాహంకారమును అట్టిదే. పాపమెట్లు మనుష్యుని బంధమునందుంచునో, అట్లే పుణ్యముకూడ మనుష్యుని బంధమునందుంచును. వాసనలనుండి సంపూర్ణముగా విముక్తి పొంది, అహంకారమును త్యజించి భగవానునికి ఆత్మసమర్పణ చేయుటకన్న వేఱువిధముగా పూర్ణస్వాధీనత లభించదు పాప పుణ్యములను నీ రెండింటి అనిష్టములను విడుచుటకు ముందు ముఖ్యావశ్యకమైన వస్తువు విశుద్ధ బుద్ధి. దేహాత్మక బుద్ధిని వర్జించి మానసిక స్వాధీనతను ఆర్జించుట బుద్ధిశోధనయొక్క పూర్వ వర్తి-అవస్థయై యున్నది. మనస్సు స్వాధీనమయ్యేనేని జీవుడును స్వాధీనమగును. దాని తర్వాత మనస్సును జయించి బుద్ధిని ఆశ్రయించి మనుష్యుడు స్వార్థమను కోరలనుండి బయలుపడును. ఇదంతయు పూర్ణముగా అగుపడకును. మనము స్వార్థమును సంపూర్ణముగా విడువము. అంతిమ స్వార్థము ముముక్షుత్వము; పరదుఃఖమును మఱచి స్వంత ఆనందమునందే మునిగియుండు నిచ్ఛ. దీనినికూడ త్యజించవలెను. సమస్త భూతములందును నారాయణుని ఉపలబ్ధిపొంది సమస్త భూతములందును, ఉపస్థితమైన నారాయణుని సేవించుట దాని చికిత్సయై యున్నది. ఇదియే సత్వగుణ పరాకాష్ఠ. దీనికన్న ఉచ్చతర అవస్థ, సత్వగుణమును అతిక్రమించి, గుణాతీతుడై, సంపూర్ణ భావముచే భగవానుని ఆశ్రయమును పొందవలెను. గుణాతీతావస్థ గీతలో నీ ప్రకారము వర్ణింపబడినది.

నాన్యం గుణేభ్యః కర్తారం యదాద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరంవేత్తి మద్భావం సోధిగచ్ఛతి ॥
గుణానేతా నతీత్యత్రీందేహీ దేహసముద్భవాన్ ।
జన్మ మృత్యు జరాదుఃఖై ర్విముక్తో మృతమశ్నుతే ॥
ప్రకాశంచ ప్రవృత్తంచ మోహమేవచ పాండవ ।
నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి ॥
ఉదాసీన వదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణావర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥
సమదుఃఖ సుఖఃస్వస్థః సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియా ప్రియో ధీరస్తుల్య నిందాఽత్మ సంస్తుతిః ॥
మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభ పరిత్యాగి గుణాతీతః స ఉచ్యతే ॥
మాంచయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
సగుణాన్సమతీత్యైతాన్బ్రహ్మ భూయాయ కల్పతే ॥

"ఎప్పుడు జీవుడు సాక్షిభూతుడై గుణత్రయిని అనగా భగవానుని త్రైగుణ్యమయి శక్తిని ఏకమాత్ర కర్తరూపిణిగా చూచునో, అట్లే గుణత్రయికి పైన ఈ శక్తిని ప్రేరేపించు ఈశ్వరుని తెలిసికొనునో, అప్పు డతడు భాగవత సాధర్మ్య లాభమును పొందగలడు. అప్పుడా దేహస్థజీవుడు సూక్ష్మ స్థూలశరీరముల రెండింటినుండి సంభూతమైన గుణత్రయములను అతిక్రమించి జన్మమృత్యు జరాదుఃఖమునుండి

ముక్తుడై అమరత్వ భోగమును పొందును. సత్వగుణ జనిత జ్ఞానము, రజోగుణ జనిత ప్రవృత్తి, తమోగుణ జనిత నిద్రానిశ్చేష్టతలు, ఈ మూడింటి భ్రమరూపక మోహమును పొందినను అతడు సంక్షోభమును పొందడు; గుణత్రయముల ఆగమనమును నిర్గమనమును సమానభావముచే నెంచుకొని ఉదాసీనునివలె తన ఆసనముపై స్థిరముగా నుండును; గుణగ్రామ మాతని విచలుని నొందించజాలవు; ఈ గుణము లన్నిటి యొక్క స్వధర్మ జాతవృత్తులను తెలిసికొని తన స్థానమునందు దృఢముగ నుండును. ఎవ్వరికి సుఖదుఃఖములు రెండును సమానములై నిందాస్తుతులు సమానములై. ధీరస్థిరములు కలిగి చలించక, మానావమానముల రెండును, శత్రుమిత్ర పక్షముల రెండును, సమానములుగా జూచుచు, స్వయంప్రేరణచే యే కార్యమును ప్రారంభించక సమస్తకర్మములను భగవానుని కర్పించి, వాని ప్రేరణచేతనే వానిని చేయుచుండునో, అట్టివానిని గుణాతీతుడని చెప్పుదురు. ఎవ్వడు నిర్దోష భక్తియోగము ద్వారా నా సేవ చేయునో, వాడీ మూడు గుణములను అతిక్రమించి బ్రహ్మప్రాప్తికి ఉపయుక్తు డగును.''

ఈ గుణాతీతావస్థ అందరికి సాధ్యము కాకున్నను దాని పూర్వవర్తి-అవస్థను పొందుటకు సత్వగుణ ప్రధాన పురుషులకు అసాధ్యము కాదు. కాని అతడును సాత్విక అహంకారమును త్యజించి, జగత్తు యొక్క సర్వ కర్మలను భగవానుని యొక్కయు త్రైగుణ్యమయి యొక్కయు లీలగను చూడవలెను. అన్నిటికంటె మొదటి ఉపక్రమము,

ఈ మాటను అర్థము చేసికొని సాత్విక కర్త కర్తృత్వాభిమానము నుండి విడివడి, భగవానునియొక్క సంపూర్ణ ఆత్మసమర్పణ రూపక కర్మను చేయుచో, గుణాతీతావస్థను పొందనగును.

గుణత్రయ గుణాతీతముల సంబంధమున నేను చెప్పినదంతయు గీతయొక్క మూలవచనములు; కాని ఈ శిక్షణ సాధారణముగా అనుసరింపబడుట లేదు; ఇంతవఱకు నేను ఆర్యశిక్షణ యను పేరుతో చెప్పిన దంతయు సాత్విక గుణానుశీలముగ నున్నది. ఈ దేశమునందు క్షత్రియ జాతి నశించుటచేత రజోగుణాదరము లుప్తమైనది. ఐనను జాతీయజీవనమందు రజోశక్తికిని మిక్కిలి ప్రయోజనము కలదు. అందుచే ప్రస్తుత కాలమున లోకుల దృష్టి గీత దిశకు ఆకృష్టమై యున్నది.

సాత్విక గుణానుశీలము మాత్రమే యగు పురాతన ఆర్యశిక్షణపు పునాదులపై గీతయొక్క శిక్షణ కట్టబడియు, దానిని అతిక్రమించినది. గీతోక్తధర్మము రజోగుణమునుండి భయము చెందదు. గీతయందు రజోశక్తిని సత్వగుణ సేవయందు నియుక్తము చేయుటకు సాధన చెప్పబడియున్నది; ప్రవృత్తి మార్గమునందు ముక్తిపొందు నుపాయము ప్రదర్శింపబడినది. ఈ ధర్మము అనుశీలన చేయుటకు జాతియొక్క మనస్సును ఏప్రకారము తయారుచేయవలయునో. ఆ విషయమును మొదలు మొదలు నేను జైలునందు హృదయంగమము చేసి కొంటిని. ఇంకను జాతిజీవన ప్రవాహము నిర్మలము కాలేదు, ఇంకను అది కలుషితమై

మలినమై యున్నది. కాని ఈ ప్రవాహముయొక్క అతిరిక్త (Excessive) వేగము కొంచెము తగ్గినపుడు, దాని ఆంతరమున దాగి యుండు విశుద్ధ శక్తియొక్క నిర్దోష కార్యము ఆరంభము కాగలదు.

ఖైదీలలో ఒక్కొక్కరును అభియోగమునందు అభియుక్తులై కుట్రయందు చేరినారను దోషముచే నాతోకూడి జైలునం దుంచబడిరి. వారిలో అనేకులు నిర్దోషులని విడుపబడిరి. మానవ సమాజమునందు హత్యకన్న గురుతరమైన అపరాధము లేదు. జాతీయ స్వార్థముచే ప్రేరితులై హత్య కావించినవారి వ్యక్తిగత చారిత్రను చూచినచో అది కలుషితముగా కనపడుచుండుటలేదు. కాని సామాజిక లెక్కను పట్టిచూచిన దోషము తక్కువకాదు. అంతరాత్మ పైన హత్యయొక్క ఛాయపడుటచే, మనస్సు కళంకితమై దానియందు క్రూరత చరించునని ఒప్పుకొనవలయును. క్రూరత బర్బరోచిత గుణము. ఉన్నతికొఱకు క్రమవికాసమును పొందనెంచిన మానవుడు దూరము చేయతలంచు గుణములలో నెల్ల క్రూరత ప్రధానమైనది. ఇది దాని పూర్ణరూపముతో త్యజించబడునేని, మానవజాతి యున్నతికిగల మార్గమునందు ఒక విఘ్నకారి కంటకము నశించినట్లెంచవలయును. అపరాధుల దోషమును గమనించితిమేని, అది రజోశక్తియొక్క క్షణిక-ఉద్దామ-ఉచ్ఛృంఖలత మాత్రమని తలంచవలెను. కాని దాని అంతరమున సాత్వికశక్తి యొకటి నిహితమై యున్నది. క్షణిక ఉచ్ఛృంఖలతా కారణముచే దేశపుస్థాయి అమంగళమగునని కొంచెమైనను భయపడ నవసరములేదు.

ఆంతరంగిక స్వాధీనతను గుఱించి పైన నేను చెప్పిన వచనములు, నా తోడిఖైదీల స్వభావసిద్ధ గుణమును సూచించును. నాతో గూడ వారందఱు ఒక సంఘముగా నొక బైట వసారా యందుంచబడినంత కాలము, వారి ఆచరణను, మనోభావముయొక్క యోగపూర్వక లక్షణములను గమనించితిని. కేవల మిద్దరు వ్యక్తులు తప్ప నితరులందఱును నోటిమాటగానైన భయమును చూపలేదు. బహుశా అందఱును యువకులే; అనేకులు అల్పవయస్క బాలకులు. వారు పట్టుబడిన అపరాధమునకు గల దండన భీషణముగా నుండును. ఆ అపరాధము నారోపించిన మాత్రము చేతనే దృఢమతిగల పురుషులు విచలితు లగుదురనుటలో ఆశ్చర్యములేదు. కాని, యీ యువకులు కేసు విచారణాఫలితము నందు, దానినుండి వెలువడుదురను ఆశనుకూడ త్యజించిరి. మాజిస్ట్రేటు కోర్టునందు సాక్షులను గుఱించి చేయబడిన ప్రయత్నమును పట్టి, నిర్దోషులు కూడ నీపాశము నుండి తప్పించుకొనుటకు సాధ్యము కాదని. శాసనము తెలియని వ్యక్తికూడ తలంచుచుండెను. మఱియు వారి ముఖముపైన భయవిషాదములకు బదులు కేవలము ప్రఫుల్లతాసరళహాస్యములు గలిగి తమ కష్టములను మఱచి ధర్మము దేశారాధనముల గుఱించిన మాటలే వారు మాట్లాడుచుండిరి. మా వార్డునం దొక్కొక్కరి యొద్ద మూడు నాలుగు పుస్తకము లుండుటచే నొకచిన్న లైబ్రరీని నిర్మించగలిగితిమి. అందులోని అధికాంశ పుస్తకములు ధర్మ సంబంధమైనవి, గీతోపనిషత్తులు, వివేకానందుని పుస్తకావళి, రామకృష్ణ కథామృతము, వారి జీవిత చరిత్రము, పురాణము, స్తోత్రమాల. బ్రహ్మ

సంగీతము యిత్యాదు లుండెను. బంకిం గ్రంథావళి, స్వదేశ గానసం బంధ పుస్తకములు చిన్నచిన్న వనేకమున్ను, ఐరోపీయ దర్శనేతిహాస ములు, సాహిత్య పుస్తకములు కొన్నియుకూడ నుండెను. ప్రాతఃకాల మున కొందఱు సాధన చేయుచుండిరి; కొందఱు పుస్తకముల పఠించు చుండిరి; మఱికొందఱు మెల్లమెల్లగా పాటలు పాడుచుండిరి. ప్రాతః కాల నిశ్చల నీరవతయందు మధ్యమధ్య నవ్వులు అలలవలె వినబడు చుండును. విచారణ దినములు కానిసమయమున కొందఱు నిద్రించు చుండిరి; మఱికొందఱు ఆడుచుండిరి. ఆటలాడు వారిపై నితరులు కోపము చేయుచుండలేదు. ఒకొక దినము సంఘము నేర్పఱచి శాంతి నాటకము నాడుచుండిరి. కాలిబంతిని విపరీతముగ నిర్మించి, ఆ యాటను ఒక్కొక దినము ఆడుచుండిరి; ఇంకను అనేక రకముల ఆటలను నాడు చుండిరి. అప్పుడప్పుడు జూజుట్సు విద్య నేర్చుకొనుచుండిరి. నలుగు రైదుగురు గంభీర ప్రౌఢవ్యక్తులు తప్ప. మిగత వారందఱును బాలకుల అనురోధముచే ఆటలయందు పాల్గొనుచుండిరి. సాయంత్రమునకు సం గీత సభలు కూడును. గానవిద్యయందు ఉల్లాసులు నిపుణులు నగు శచీంద్ర హేమదాసుల చుట్టు కూర్చొని మేము సంగీతమును వినుచుం టిమి. స్వదేశీ లేక ధర్మసంబంధమైన పాటలుతప్ప వేఱుపాటలు పాడు చుండుటలేదు. ఒక్కొక దినము హాస్యప్రీతిచేత, ఉల్లాసమైన హాస్య పాటలు, అభినయనము, దూరాగత శబ్దానుకరణములతో కాలము గడుపు దుము; కొన్ని సాయంసమయముల గజేడియా పాటలతో కాలము గడుపుచుంటిమి. ముకుళమువలె, మనస్సు నెవరును ముడుచుకొని

కూర్చుండుటలేదు. అందరును, ఆనందమునందు కాలము గడుపుచుం డిరి. ఈ విధ నిశ్చింతభావము, కఠిన దుష్క్రియాసక్తి హృదయులకు అసంభవము. కాని వీరియందు కాఠిన్యము క్రూరత, దుష్క్రియాసక్తి కుటిలతలు లేశమైన లేకుండెను. ఉండిన నవ్వులు మాటలు ఆటలు అన్నియు, ఆనందమయము, పాప రహితము, ప్రేమమయమునై యుండెను.

ఇట్టి మానసిక స్వాధీనముచే ఆత్మ పుష్పము త్వరగా వికసిం చును. ఈ ప్రకారముగా క్షేత్రమునందు బీజములు వేయునెడల స్వర్గ సుందరఫలములు పండును. క్రైస్తవమతస్థ దొకడు యొక బాలుని జూపి, తన శిష్యులతో, ఈ బాలకునవలె నుండువారలు బ్రహ్మలోకమును చెందుదురు'' అని చెప్పెను. జ్ఞానానందములు సత్వగుణ లక్షణములు. ఎవ్వడు దుఃఖసమయమునందు దుఃఖించడో, అన్ని అవస్థలయందును ఆనందమును ప్రపుల్లతను కలిగియుండునో, అతడు యోగమున కధి కారి. జైలునందు రాజసిక భావమునకు ప్రశ్రయము లభించదు, అతిరిక్త నిర్జనకారాగారమందు ప్రవృత్తి పరిపోషకము కాజాలదు. ఇట్టి అవస్థ యందు. అసుర మనస్సుగల చిరభ్యస్త రజోగుణ శక్తి సామగ్రి, అభావమునందు దెబ్బతిన్న వ్యాఘ్రమువలె, స్వయము తన్నుదానే నాశన మొనర్చుకొనును. పాశ్చాత్యకవిగణము చెప్పినట్లుగా "తీవ్రసంతాప ముచే మనస్సును తపింపచేయవలెను'' అను నట్టి అవస్థ ఘటించును. కాని భారతవాసి మనస్సు ఈ ప్రకారముగా నిర్జనతయందును బాహ్య

కష్టములయందును పూర్వస్వభావముచే భగవానుని దిశ కాకృష్టమై పరు గిడును మా కందఱికిని నిట్టి అవస్థయే కలిగినది. ఎక్కడ నుంచియో ఒక ప్రవాహము వచ్చి అందఱిని ఒక్కచోటికి కొనిపోయెను. ఎప్పుడును భగవానుని పేరు చెప్పనివాడుకూడ సాధనచేయుట నేర్చుకొనెను. మఱియు పరమదయాళుని దయ ననుభవించి ఆనందమగ్నుడయ్యెను. అనేక దినముల అభ్యాసముచే యోగులు పొందు అవస్థను, ఈ బాలకులు నాలుగైదు నెలలలో సాధనచే పొందగలిగిరి. శ్రీ రామకృష్ణ పరమహంస యొకసారి యిట్లు చెప్పియుండెను. "ఇంకను మీరేమి చూచుచున్నారు; చూడవలసిన దింకేమియు లేదు; దేశమును ముంచివేయుచునొక ప్రవాహము వచ్చుచున్నది. దాని ప్రభావముచే అల్పవయస్క బాలకులు కూడ మూడు దినముల సాధనచే సిద్ధి పొందగలరు." ఈ బాలకుల జూచి, వారి భవిష్యద్దివ్య ఫలితము గుఱించి సందేహించజాలము.

జైలునందు నలుగురైదుగురు తప్ప, మిగత వారందరియందును సాత్వికభావ తరంగములు నిండి నిబిడీకృతమై, అందరి హృదయములను మహానందముచే ఉత్ప్లావిత మొనర్చుచుండెను. ఈ ఆనందస్వాదమును ఒక్కసారి చవిచూచినవారు, దానిని మరెప్పుడును మరువరు; అట్లే మరేవిధమైన ఆనందమును దీనితో సమానముగా స్వీకరించజాలరు. ఈ సాత్విక భావమే దేశోన్నతికి కారణమై యున్నది. భ్రాతృభావము, ఆత్మజ్ఞానము, భాగవతప్రేమ యే సహజభావముచే భారతవాసుల మనస్సుపైన అధికారముచేసి కార్యములందు ప్రకటిత మగు

చున్నదో, అట్టి సహజభావముచే యితర జాతులయందవి ప్రకాశితమగుట అసంభవము. అవసరమైనది తమోవర్జనము, రజోదమనము. సత్య ప్రకాశము. భగవానుని నిగూఢ-అభిసంధియొక్క ఫల స్వరూపమును భారతవర్ష మిప్పుడు దాల్చుచున్నది.



# హి రో వూ షి యి తో

మానవజాతియందు ముక్త జీవులు రెండు ప్రకారములుగ జన్మను గ్రహింతురు. ఒక ప్రకారముగ, క్రమ వికాస ప్రవాహమునందు కొట్టుకొనిపోవుచు, ఆ ప్రవాహమునం దగ్రగాములయ్యును, క్రమ వికాస ధర్మము ననుసరించి, అంతర్హిత దేవత్వమును ప్రకాశ మొన రించువారు కొందఱు,—వీరు సాధారణ మనుష్యులు. రెండవ ప్రకార ముగ, ఈ క్రమ వికాస సహాయార్థము, దానిని మించిన శక్తిని విభూతి రూపమున వహించి, జన్మను గ్రహించువారు మఱికొందఱు,—వీరు స్వతంత్రులు. ఈ రెండవ ప్రకారమైన జీవులు యే జాతియందు, లేక యే యుగమునం దవతరించెదరో, ఆ జాతియొక్క చరిత్రను, ఆచారములను, అట్లే ఆ యుగధర్మములను వారు గ్రహించుచు, ఈశ్వర శక్తిచేతను, స్వకీయ స్వభావశక్తిచేతను కొంత అసాధ్యమైన కర్మలను సాధారణ మనుష్యుల కొఱకు సాధించి, జగత్తు గతిని కొంత పరివర్తిత మొనర్చి, ఇతిహాసమునందు దివ్యనామమును రచింపచేసి, తమ లోకము నకు గడంగెదరు. వారి కర్మచారిత్రములు, మానవుల ప్రశంసలకో, లేక నిందలకో పాత్రమగుచుండును. మనము వారిని ప్రశంసింతుము, లేక నిందింతుము; కాని వారుమాత్రము భగవానునిచే నియమింపబడిన కార్య

మునకు నియంత్రితులై, ఆ కార్యముద్వారా మానవజాతి భవిష్య నిర్మాణ మును చేయుచు, తమ దారియందు దృఢమనస్సుతో నడిచెదరు. సీజరు, నెపోలియన్, అక్బరు, శివాజి, ఈ ప్రకారమైన విభూతులు. జపాను దేశపు హిరోవూమియితో గూడ ఈ శ్రేణికి చెందినవాడే. పైన చెప్ప బడినవారిలో యేయొక్కరుకాని, గుణమును ప్రతిభను కర్మమహత్వ మునుబట్టి లెక్కించితిమేని, అథవా భవిష్యత్ఫలము చేతకూడ లెక్కించి నను, యితోకన్న అధికశ్రేష్ఠులుకారు. ఇతిహాసమునందును, జపాను యొక్క అభ్యుదయము నందును యితోస్థానము ప్రధానమైయున్నది. మిగతావారి విషయములు, చరిత్రను చదివినవారికందటికిని తెలియగలదు: కాని, కొందటికిమాత్రమే యితని విషయము తెలిసియున్నది. ఏలయన జపానుయొక్క అభ్యుదయము కొఱకు, యితో, క్రమఉపాయమును, ఉద్దేశ్యముయొక్క ఉద్భావనను కలిగి జీవిత శేషపర్యంతము ఒక్కడే ఆర్భాటము లేక ఈ పరివర్తన మొనరించెను. జపానుయొక్క యితర మహాపురుష లందఱు అతని చేతియందలి యంత్రమాత్రములుగా నుండిరి. జపానుయొక్క ఐకత్యాస్వాధీనతలకొఱకు యితో విద్యా బలము సైన్యబలము, నౌకాబలము, అర్థబలము, వాణిజ్యము రాజనీతి యిత్యాదులను సృష్టించి కృతార్థత కలుగజేసెను. ఇవన్నియు భావి సామ్రాజ్యమును సిద్ధపఱచుచున్నవి. కాని అతడుచేసిన దంతయు, బాహ్యముగా అగుపడునట్లుగాక లోలోపలనే జరుపబడెను. జర్మనీ యొక్క కైసరువిలియమ్, లేక ఇంగ్లాండుయొక్క లాయిడ్ జార్జి చేసినదంతయు, తలంచినదంతయు ప్రపంచమున కంతకును తెలియుచుం

డెను. కాని యితో చేసినదికాని తలంచినదికాని మరెవ్వరికిని తెలియుట లేదు. దాని రహస్యముయొక్క కల్పనయు, చేష్టయు ఫలీభూతమైన పుడు జగత్తు విస్మయము పొంది, యిన్ని దినములు కూడ లోపలనే కార్యము జరుగుచుండెనా యని తలంచెను. మఱియు అతని కర్మ ప్రకాండ మింతటి అద్భుత ప్రతిభతో ప్రకాశించెను. తన కల్పనకార్యము లను స్వకీయ ప్రయత్నముచే కార్యఫలము నొందించ అభ్యసించుటకు బదులు, మాటలచేతనో, వ్రాతలచేతనో నిరూపించ ప్రయత్నించియుండె నేని, ప్రపంచమంతయు నతడు యున్మత్తుడనియు అసాధ్య సాధన ప్రయాసి యనియు, అథవా స్వప్న విలాసియనియు గేళిచేసి యుండెడి వారు. ఏబది సంవత్సరములకు లోపల జపాను తన స్వాతంత్ర్యమును రక్షించుకొని, సమస్త పాశ్చాత్య సభ్యతలను అలవరచుకొని, ఇంగ్లాండు జర్మనీ ఫ్రాంసు దేశములతో సమానముగా ప్రబల పరాక్రమ శీలజాతి కాగలుగునని, చైనాను నోడించునని, రష్యాను గెలుచునని, దూరదూర దేశ విదేశములకు వాణిజ్యమును చిత్రకళను వ్యాపకము చేయునని, బుద్ధియొక్క ప్రశంసా సాహసములను, భయోత్పాతమును వ్యాపింప చేయునని, కొరియా దేశముపై అధికారము చేయునని, ఫార్మోజాను ప్రవేశించునని, గొప్ప సామ్రాజ్యమునకు పునాదుల నేర్పఱచునని, జాతీయశిక్షణయొక్క చరమోన్నతియగు ఐక్యత-స్వాధీనత-సామ్యము లను సాధించునని, ఎవ్వరు విశ్వసించియుండిరి ? "నా నిఘంటువు నుండి అసాధ్యమను పదమును తీసివేసినానని" నెపోలియన్ చెప్పు చుండెను. ఇతో, ఈ వచనమును చెప్పినను చెప్పకున్నను కార్యము

నందు మాత్రము అట్లే జరిపెను. నెపోలియన్, అపేక్షించిన కార్యమున కన్న, ఇతో కార్యము గొప్పది. ఇట్టి మహాపురుషుడు, యే హత్యకారుని గుండుచేత కార్యమధ్యమునందు చచ్చియున్నను, ఎవ్వరును దుఃఖించు టకు కారణముండి యుండదు, ఎవ్వడు జపాను కొఱకు ప్రాణోత్సర్గ మొనరించెనో, ఎవనికి జపానే చింతనా విషయముగ నుండెనో, ఎవ నికి జపాను ఉపాసదేవతగా నుండెనో, అతనికి జపానుకొఱకు ప్రాణ త్యాగము చేయుటకూడ మహాసుఖముగ, సౌభాగ్యముగ, గౌరవముగ నుండెడిది. "హతో వాప్రాప్స్యసి స్వర్గమ్,జిత్వావాభోక్ష్యసే మహీమ్." అను సత్యము నందలి పరమ ఫలములు రెండును, హిరోషూమియితో యొక్క జీవన వృత్తమందు సిద్ధించెను.



# దుర్గా స్తోత్రము

హే, మాతా, దుర్గే! సింహ వాహినీ, సర్వశక్తి దాయినీ, మాతా, శివప్రియే, భారత యువకగణమగు మేము నీ శక్తియంశచే ఉద్భూతులమై, నీ మందిరమున కూర్చొని నిను ప్రార్థించుచున్నాము. హే, మాతా, వినుము; నీవు భారతదేశమునం దావిర్భూతవు కమ్ము. ప్రకాశమానివి కమ్ము.

మాతా. దుర్గే! మేము యుగయుగమునను మానవ శరీరము ధరించి జన్మజన్మమునను నీ కార్యమునే చేయుచు, నీ ఆనందధామమున కఱుదెంచుచుందుము. ఇప్పుడుకూడ జన్మమెత్తి నీ కార్యవ్రతులమై యున్నాము. వినుము, హే మాతా, నీవు భారతదేశమునం దావిర్భూతవు కమ్ము, మాకు సహకారిణివి కమ్ము.

మాతా, దుర్గే! సింహవాహినీ, త్రిశూలధారిణీ, వర్మ-ఆవృత-సుందర-శరీర-ధారిణీ, జయదాయినీ, మాతా! నిన్ను ప్రతీక్షించుచునే యున్న యీ భారతదేశము, నీ మంగళమయ మూర్తిని చూచుట కుత్సు

కమై యున్నది. వినుము, హే మాతా! నీవు భారతభూమియందు దావి ర్భూతవు కమ్ము; ప్రకాశమానివి కమ్ము.

మాతా, దుర్గే! బలదాయినీ, ప్రేమదాయినీ, జ్ఞానదాయినీ, శక్తి స్వరూపిణీ, భీమే, సౌమ్య-రౌద్ర-రూపిణీ! ఈ భారతజీవన సంగ్రామ మున నీ ద్వారా ప్రేరితులమైన మా కందఱకును, మా ప్రాణమనస్సు లందు అసురశక్తిని అసురోద్యమమును, మా బుద్ధి హృదయములయందు దివ్యచారిత్రను, దివ్యజ్ఞానమును నిమ్ము.

మాతా, దుర్గే! జగత్ శ్రేష్ఠ భారతజాతి. ఘోర తిమిరమున ఆచ్ఛ న్నమై యున్నది. నీవు హే, మాతా, గగన ప్రాంతమున మెల్లమెల్లన ఉదయించుచున్నావు; నీ స్వర్గీయ శరీర తిమిర-వినాశి-అభాసచే, ఉష ప్రకాసించుచున్నయది. ఆలోకనమును విస్తరింపచేసి. హే మాతా. తిమిరమును వినాశము చేయుము.

మాతా, దుర్గే! శ్యామలా, సర్వసౌందర్యాలంకృతా, జ్ఞాన ప్రేమ శక్తుల కాధారమగు భారతభూమి, నీ విభూతి. ఇన్ని దినముల వఱకు శక్తిసంగ్రహణకుగా, తన్నుదా దాచియుంచుకొనెను. ఆగత యుగమున ఆ గతకాలమున భారతావని భారమును, తన భుజములమీద నిడికొని భారతజనని లేచుచున్నది. రమ్ము, హే మాతా, ప్రకాశమానివి కమ్ము.

మాతా, దుర్గే! నీ ప్రసాదముచే, నీ ప్రభావముచే, మహత్కార్యములు, మహద్భావములు మాయందు, నీ సంతతియగు మాయందు, ఉపయుక్తమగు గాక. హే మాతా, మాయందు క్షుద్రతను స్వార్థమును, భయమును నశింప చేయుము.

మాతా, దుర్గే! కాలరూపిణీ, నృముండమాలినీ, దిగంబరీ, కృపాణపాణీ, అసురవినాశిని! నీ క్రూర నినాదముచే అంతశ్శత్రువులను వినాశము కావింపుము, అవి యొక్కటియైనను మాయం దుండకుండ చేయుము. వానినుండి మేము విమలనిర్మల విముక్తుల మగుదుము గాక, ఇదే మా ప్రార్థన. హే మాతా, ప్రకాశమానివి కమ్ము.

మాతా, దుర్గే! భారతభూమి స్వార్థముచే భయముచే క్షుద్రాశయముచే మ్రియమాణమై యున్నది. హే మాతా, మమ్ము మహామహులుగను, మహాప్రయాసులుగను ఉదారచేతసులుగను, సత్యసంకల్పులుగను కావింపుము. మఱియు మమ్ముల నిపుడు అల్పాభీప్సితులను, నిశ్చేష్టితులను, అలసులను, భయభీతులను కాకుండ నొనరింపుము.

మాతా, దుర్గే! నీ ప్రియ-ఆర్యసంతతి యగు మా యందు యోగశక్తిని విస్తరింపచేయుము. మాయందు లుప్తమైన శిక్షణ చరిత్ర, మేధాశక్తి, శ్రద్ధాభక్తి, తపస్సు, బ్రహ్మ చర్యము, సత్యజ్ఞానములను వికసింపచేసి జగత్తును ఉన్నత మార్గమునకు గొనిపొమ్ము. హే మాతా,

దుర్గతినాశినీ, జగదాంబా! మానవుని సాహాయ్యము కొఱకు ప్రకాశ మానివి కమ్ము.

మాతా, దుర్గే! అంతశ్శత్రువులను సంహార మొనరించి, బాహ్య బాధావిఘ్నములను నిర్మూలన మొనరింపుము. బలశాలినీ, పరాక్రమీ, ఉన్నతచేతనా శీలినియగు భారతజాతి పవిత్ర కాననము లందును, ఉర్వర క్షేత్రములందును, గగన సహచర పర్వత తలములందును, పూతసలిల నదీతీరములందును, ఐక్యతచే, ప్రేమచే సత్యశక్తులచే, శిల్పముచే సాహిత్యముచే విక్రమముచే, విజ్ఞానముచే శ్రేష్ఠమై నివాస మొనరించుగాక. మాతృచరణములందు నిదే మా ప్రార్థన, హే మాతా, ప్రకాశమానివి కమ్ము.

మాతా, దుర్గే! మా శరీరములందు యోగ బలము ద్వారా ప్రవేశింపుము. మేము, నీ యంత్రములము, అశుభ వినాశి ఖడ్గాసులము, అజ్ఞాన వినాశప్రదీపులము. హే మాతా! భారత యువకులమగు మా యాశను పూర్ణము చేయుము. నీవయంత్రివై మమ్ముల యంత్రములనుగ నడిపింపుము; అశుభ హంత్రివై ఖడ్గములను దుయ్యుము, జ్ఞాన దీప్తి ప్రకాశినివై హస్తమునందు ప్రదీపముబూని ప్రకాశమానివి కమ్ము.

మాతా, దుర్గే! నిన్ను దర్శించిన యిప్పటినుండి మే మెన్నటికిని నిను నిక విసర్జింపము. శ్రద్ధాభక్తి ప్రేమలను త్రాడుచే నిన్ను బంధించెదము, రమ్ము, మాతా, మా మనఃప్రాణశరీరములను ప్రకాశ మాన మొనరింపుము,

వీరమార్గ ప్రదర్శినీ, రమ్ము! నిన్నిక విసర్జింపము. మా సమస్త జీవనము అవిచ్ఛిన్న దుర్గాపూజ యగుగాక: మా సమస్త కార్యము అవిరత ప్రేమమయ శక్తిమయ మాతృసేవా వ్రతముచే యుక్తమగు గాక, ఇదియే మా ప్రార్థన. హే మాతా, నీవు భారతదేశమునం దావి ర్భూతవు కమ్ము, ప్రకాశమానివి కమ్ము.



# స్వప్నము

ఒక దరిద్రుడు చిమ్మచీకటి గదిలో కూర్చొని తన శోచనీయమైన స్థితిని గుఱించియో, భగవానుని రాజ్యమందలి అన్యాయములను గుఱించియో తలపోసికొనుచుండెను. దురభిమాన పరతంత్రుడై అతడీలా చెప్పెను. "లోకులు కర్మవాదమునకు ప్రాశస్త్య మిచ్చి భగవంతుని సత్కీర్తిని రక్షింపజూతురు. గత జన్మపాపము, ఈ జన్మయందు నా దుర్దశకు కారణమయ్యెనేని. నేనంత పాపినై యుంటినేని, నిశ్చయముగా నీ జన్మమునందుకూడ నా మనస్సునందు పాపచింతనల స్రోత నిరంతరము ప్రవహించుచునే యుండవలెను గదా! ఇంత ఘోరపాతక మనస్సు ఒక్కనాటిలో నిర్మలము కాగలదా? మఱి, యా వీధిలో అతనిని చూడుము! అతడు మూడు గవ్వలకు పనికిరానివాడై యుండియు. వాని కెంత ధనము! ఎంత అధికార దర్పము, ఎంత వెండి బంగారము! ఎందఱు దాసదాసీజనులు! కర్మఫలమే సత్యమైన యెడల వాడు పూర్వ జన్మమునందు నిశ్చయముగా జగద్విఖ్యాత సాధువై యుండవలెను, లేదా మహాత్ముడై యుండవలెను. కాని దాని చిహ్న మాత్రమైనను, ఈ జన్మయందు వానిలో కనబడుటలేదు. ఇంతటి నిష్ఠుర నీచ మోసకారి మనుష్యుడు ప్రపంచమునం దెక్కడను గానరాడు. కర్మవాదమంతయు

భగవంతుని తక్కరి విద్యగా నున్నది; మానవమాత్రుని హృదయమును దృఢముగ నుంచుటకై పన్నిన పన్నుగడయది, శ్యామసుందరుడు చాల గొప్పచతుర చూడామణి; నా చేతికి దొరకకున్నాడు. అతని చమత్కార మంతయు అందులోనే యున్నది; లేదేని తగిన శిక్ష నొసంగి అతని చాతుర్య మంతయు పోగొట్టెదను."

ఇట్లాలోచించునంతలో, అతని చీకటి గదియందు అతిశయోజ్జ్వల భావతరంగ మొకటి హఠాత్తుగా ప్రవహించి, మఱల తక్షణమే ఆ భావ తరంగము అంధకారమునందు లీనమైపోయెను, తన ముందర నొక సుందర కృష్ణవర్ణ బాలకుడు చేతియందు దీపము పట్టుకొని నిలుచుండుట కనబడెను; ఏమియు మాట్లాడక నవ్వుచుండెను. శిరస్సునందు మయూర మకుటము, పాదములయందు నూపురములు ధరించిన యాతనిని చూచి, చేతికి పట్టుబడుటకు శ్యామసుందరుడే స్వయముగా వచ్చినాడా యనితోప నా దరిద్రుడు సిగ్గుపడెను; ప్రణామము చేయవలయునను తలంపొకసారి కలిగెను. కాని బాలకుని నవ్వుముఖము చూచి ప్రణామము చేయుటకును ఇష్టముపోకుండెను. అంత్యమున వాని నోటినుం డీ వాక్యములు బయ ల్వెడలెను.—"అరే! కన్నయ్య, నీ వెందులకు వచ్చితివి ?"

బాలకుడు నవ్వి జవాబిచ్చెను,—"నీవు నన్ను పిలువలేదా ? ఇప్పుడిప్పుడే నన్ను కొట్టవలెనను కోరిక నీ మనస్సునందుండలేదా ? అందుచే నేనువచ్చి నీచే జిక్కినాను; లేచి కొట్టుట కారంభించుము."

దరిద్రుడు మరింత సిగ్గుపడెను. భగవానుని కొట్టతలంచి యుండినందుల కనుతాపము కలుగలేదు. కాని, ఇంతసుందర బాలకునితో స్నేహముచేయుటకు బదులు కొట్టుట మంచిదికాదని తోచెను. బాలకుడు మఱల చెప్పెను,—“ఎవ్వరు నన్నుజూచి భయపడక, నన్ను సఖుని వలె జూతురో, స్నేహభావముతో నిందింతురో, నాతో క్రీడించుట కిచ్ఛగింతురో, వారు నాకు చాలా ప్రియులు. నేను క్రీడకొఱకే జగత్తును సృష్టించినాను. ఈ క్రీడయందుపయుక్తముగానుండు సహవాసులను నేను సదా వెతుకుచుందును. కాని, అన్నా, అట్టి స్నేహితులెక్కడ దొఱుకుదురు ? అందఱికిని నాపైన కోపమే, అందఱును నాపైన దావాలు వేయుచు, దానము, మానము, ముక్తి, భుక్తి మొదలగు ననేక కోరికలను కోరుదురు. కాని నన్ను మాత్ర మెవ్వరును కోరరు! ఎవ్వ రేదికోరిన వారికది నేను యిచ్చెదను. ఏమి చేయవచ్చును; వారిని సంతోషపెట్ట నవసర మున్నది; లేనిచో వారు నా ప్రాణము నపహరింప నెంతురు. నీ కేమైన కావలసిన చూడుము. నీ యభిలాషను పూర్తి చేసికొనుటకు నన్ను పిలిచియున్నావు. మంచిది, నేను కూడ నీ కొరడాదెబ్బలు తినుటకు వచ్చియున్నాను - “ఏయథా మాం ప్రపద్యంతే, తం స్తథైవ భజామ్యహం” అవును. ఈ ప్రకారము నీవు చేయుటకు ముందు నా నోటినుండి నీవేమైన వినుట కిచ్ఛగింతువేని నీకు నా కార్య ప్రణాళికను జూపించెదను, ఏమి నీకది యిష్టమేనా ?”

హరిమోహనుడు, —"నీకట్లుచేయుట కిష్టముండెనా ? కాని నీవు వట్టిమాటలతో కాలము గడుపనున్నట్లు నాకు కనబడుచున్నది; నీవంటి చిన్నబాలుడు నా కుపదేశ మివ్వగలడన్న, నేనెట్లు విశ్వసింతును ?"

బాలకుడు మఱల నవ్వి చెప్పెను — "మంచిది. రమ్ము చూడుము, నేను చేయగలుగునదేదో." ఈ మాటలు చెప్పి, శ్రీకృష్ణుడు హరిమోహనుని తలపై చేయియుంచెను. హఠాత్తుగా దరిద్రుని సమస్త శరీరమునందును విద్యుచ్ఛక్తి ప్రవహింపజొచ్చెను; మూలాధారమున నిద్రించుచున్న కుండలనీశక్తి, అగ్నిమయ సర్పిణీరూపముతో. గర్జనచేయుచు, వాని బ్రహ్మరంధ్రము నుండి పరుగిడెను; వాని మస్తిష్కము, ప్రాణమయశక్తియొక్క తరంగమునందు మునిగిపోయెను. స్వల్ప కాలములో, అతనిని చుట్టియున్న యింటిగోడలు దూరము తొలగిపోయినట్లును, నామరూపజగత్తు తనను విడిచినట్లును, అనంత్యమునందు తాను లీనమైనట్లును నుండెను. హరిమోహనుడు బాహ్యజ్ఞాన శూన్యుడయ్యెను. అతనికి మఱల తెలివి కలిగినంతనే అతడు వేఱు అపరిచిత గృహమునందా బాలకునితో కూడి నిలిచి యుండినట్లును, ఒక వయోవృద్ధుడు దవడపై చేతినుంచుకొని, నొక గద్దియపై కూర్చొని ప్రగాఢమైన చింతలో మునిగియుండినట్లును కనబడెను. ఘోరచింతన యందు, వికృతహృదయ విదారక నిరాశచే నుండు అతని మలినముఖమును చూచి, తాను గ్రామములో చూచుచుండిన వృద్ధుడు, సర్వాధికారి అతడేయను విశ్వాసము కలుగకుండెను. అంత్యమున అత్యంత భయ

భీతులతో బాలకునిచూచి అతడిట్లు చెప్పెను—"అరేకన్నయ్యా, నీవేమి చేసితివి! చోరులవలె, ఘోరరాత్రియందు పరుల ఇంటిలో ప్రవేశించితిమి. పోలీసులు వచ్చి మనలను పట్టుకొనవచ్చును; మఱియు కొట్టి కొట్టి మన ప్రాణములను తీయవచ్చును. ఈ 'తీన్ కౌడిశీలుని' ప్రతాపము నీకు తెలియదా?"

బాలకుడు నవ్వి, చెప్పెను,—"బాగుగా తెలియును; దొంగ తనము నా పూర్వవృత్తి; పోలీసులు నాకు బాగుగా తెలిసినవారు, నీవు భయపడవద్దు. నీకిప్పుడు సూక్ష్మదృష్టి నిచ్చెదను; వృద్ధుని మనసులో జరుగు కార్యవిధానమునంతను తెలిసికొనుము. "తీన్‌కౌడిశీలుని" ప్రతాపము నెఱిగినట్లే నా ప్రతాపమునుకూడ తెలిసికొనుము."

ఇప్పుడు, హరిమోహనుడు వృద్ధుని మనస్సును చూచుటకు సమర్థుడయ్యెను. వృద్ధధనాఢ్యుని నగరు నానాప్రకార ఆక్రమణములచే విధ్వంసమగుచుండెను; ఆతని తీక్ష్ణప్రకాశమానబుద్ధియందు భీషణ మూర్తులు, పిచాచములు, రాక్షసులు మొదలగువారు ప్రవేశించి అతని సుఖమును కొల్లకొట్టుచుండిరి. వృద్ధుడు, తన పుత్రులలో నెల్ల ప్రియ పుత్రుడగు కడపటివానితో కలహించి వానిని యింటినుండి బయటకు వెళ్ళగొట్టియున్నాడు; ఇప్పుడు వాడు తన ప్రియపుత్రుని పోగొట్టుకొని శోకమునందు మునిగి మరణాతురుడై యున్నాడు; మఱియు, క్రోధము, గర్వము, హఠము వాని హృదయమును బంధించి, పహారాచేయుచున్నవి.

ఆతని హృదయమందు, క్షమ ప్రవేశించుట కంతరాయ మేర్పడినది. అతని కూతురొక్కతె, దుశ్చరిత్ర కలదియను కళంకము కలుగనుండు టచే తాను ప్రేమించుచుండిన కూతురును తన యింటనుండి తొలగించి ఆమెకొఱ కేడ్చుచున్నాడు. తనబిడ్డ నిర్దోషియని యీ వృద్ధునికి తెలి యును; కాని సమాజ భయము, లోక లజ్జ అహంకారము, స్వార్థము, అనుచరులయందలి అతిశయగౌరవము, అను నీకారణములచే తానేమి చేయలేకుండెను; చేయుటకు ఇష్టముకూడ కలుగకుండెను; మధ్యమధ్య మృత్యువు, పరలోకచింతన, వృద్ధునికి కఠోరభీషణ రూపమును దాల్చు చుండెను. మరణచింతయను తెరవెనుక యమదూతలు తొంగితొంగి చూచుచు, వాని కవాటమును తట్టుచుండిరి. ఆ శబ్దము వినినప్పుడెం తయు, భయవ్యాకులములచే, వృద్ధుడు అలమట చెందుచుండెను. ఈ భయంకరదృశ్యమును జూచి హరిమోహనుడు భీతిచెందెను; అతడు బాలకుని దెశకు జూచి "అరే, కన్నయ్యా! ఇదియేమిటి వృద్ధుడు [illegible] సుఖియని నేను తలంచియుంటిని."

బాలకుడు—"ఇదియును నా ప్రతాపమే. [illegible] ప్రతాపమెక్కువ, ఆ వీధియందలి "తీన్‌కౌడీ" [illegible] వాడి శ్రీకృష్ణునిదా? హరిమోహనా, చూడుము; నా స్వభావమునే [illegible] పోలీసులు, పహరా, గవర్నమెంటు; రాజ్యము [illegible] నేనున్న రాజునై ఆట ఆడించుచున్నాను. [illegible] నున్నదా?"

హరిమోహనుడు,—"లేదురా, బాబూ, నాకీయాట చాలా పెద్దదిగా నున్నది. నీకది బాగుగా కనపడుచున్నదా ?"

బాలకుడు నవ్వి జవాబు చెప్పెను, — "నాకన్ని యాటలు యిష్టమే; కొరడాదెబ్బలు కొట్టుటకును తినుటకును ఇష్టమే. ప్రజలు సామాన్యముగ బాహ్యమునే చూచెదరు; అంతరమును చూచుటకు వలయు సూక్ష్మదృష్టి వికాసము వారికింకను కలుగలేదు. అందుచేతనే నీవు దుఃఖపరుడ వనియు, "తీన్ కౌడీశీలుడు" సుఖపరుడనియు చెప్పుచుంటివి; ఈ వృద్ధునికి పార్థివవస్తువు లేవియును కొదువలేదు; ఐనను ఈ ధనవంతుడు నీకంటె ఎంతదుఃఖమును బాధను పడుచున్నాడు. ఇట్లెందులకు జరుగుచున్నది ? నీవు చెప్పగలవా ? దాని సమాధానమిది, మనస్సునందే కష్టమున్నది, మనస్సునందే దుఃఖమున్నది. సుఖదుఃఖములు మనోవికారములు మాత్రమే, ఎవ్వడి దంతయు తనది కాదని తలంచునో, ఎవ్వనికి సంపద, విపత్తుమాత్రమే యైయున్నదో, ఆతడిచ్ఛయించెనేని ఆ విపత్తుకు అంతరముననే పరమసుఖము నాతడు పొందగలడు. మఱియు నీవేవిధముగా నీరసపుణ్యమునందు దినమంతయు గడుపుచు, కేవల దుఃఖచింతన చేయుచున్నావో, అట్లే యీతడు కూడ తన కాలమునంతయు నీరసపాపమునందు గడుపుచు కేవల దుఃఖచింతనయందే యున్నాడు. అందువలన పుణ్యముచే కేవల క్షణిక సుఖమును, పాపముచే కేవల క్షణిక దుఃఖమును, లేక నీరస పాపపుణ్యములచే క్షణిక సుఖదుఃఖములను పొందుచుందురు. ఈ ద్వంద్వములయం దానందము

లేదు. ఆనందముయొక్క నివాసమునకు బీగము నా యొద్ద నున్నది. ఎవ్వరు నాయొద్దకు వచ్చెదరో, నా ప్రేమపాశముచే బద్ధులగుదురో, నన్ను సాధింతురో, నాపై దౌర్జన్యము సలిపెదరో, అత్యాచారము చేయుదురో, వారు నా ఆనందముయొక్క బీగమును తీసికొనగలుగుదురు.

హరిమోహనుడు మిగుల తత్పరత్వముతో శ్రీకృష్ణుని వచనములు వినుచుండెను. బాలకుడు మరల చెప్పెను;—"హరిమోహనా, ఇంకను చూడుము: ప్రీతిలేని పుణ్యము నీయొద్ద నీరసమైపోయినది; మరియు ఈ సంస్కార ప్రభావమును విడుచుట, ఈ తుచ్ఛాహంకారమును జయించుట నీకు మహాకఠినములుగా నున్నవి. ఇదేవిధముగా, పాపము కూడ వృద్ధునియొద్ద నీరసమైపోయినది, మరియు సంస్కార ప్రభావముచే నతడు వానిని విడువలేకున్నాడు. జీవితమునందు నరకబాధను బడుచున్నాడు. వీనినే "పుణ్యబంధనము, పాపబంధనము" అని చెప్పుదురు. అజ్ఞానజనితసంస్కారము, త్రాడుపలె ఈ బంధనముల ముడివేయును. కాని వృద్ధునియొక్క ఈ నరకబాధ గొప్పశుభావస్థగా నున్నది; దానినుంచి వానికి పరిత్రాణము మంగళము కలుగును."

హరిమోహను డింతవఱకు బాలకుని మాటలు నిశ్శబ్దముగా వినుచుండి ఇప్పు డాతనికిట్లు చెప్పెను;—ప్రియమగు కన్నయ్యా, నీమాటలు చాలాతీపిగా నున్నవి; కాని వానిచే నాకు సమాధానము కాలేదు. సుఖదుఃఖములు మనోవికారములు కావచ్చును; కాని బాహ్యావస్థయు వానికి

కారణముగా నున్నది; విచారించి చూచిన క్షుధాజ్వాలచే ప్రాణము పరితపించునపు డెవ్వడైన పరమసుఖము ననుభవింపగలడా? రోగముచే ఆకలిచే శరీరము బాధపడునపుడు ఎవ్వడైన నీ మాట నంగీకరింపగలడా?

బాలకుడు చెప్పెను, "రమ్మా, హరిమోహనా, అదియును కూడ నీకు చూపెదను."

ఇట్లు చెప్పి, బాలకుడు హరిమోహనుని తలపైన మఱల చెయ్యి పెట్టెను. చేతిస్పర్శ కలిగినంతనే, హరిమోహనునికి వేరొక దృశ్యము కనపడెను, వృద్ధుని గృహ మదృశ్యమై, దానిస్థానమున నొక నిర్జన, రమ్య, పర్వత, వాయుసేవిత, శిఖరముపై నొక సన్యాసి ఆసీనుడై ధ్యాననిమగ్నుడై యుండుట చూచెను. అతని పాదముల ముందర నొక వ్యాఘ్రము రక్షకునివలె పరుండియుండెను. వ్యాఘ్రమును జూచి హరిమోహనుని కాళ్లు భయముచే కదలకుండెను. కాని బాలుడాతని లాగుకొని సన్యాసికడకు దీసికొనిపోయెను; బాలకుని సంగము నందు నిస్సహాయుడై అతడు నడచెను, అప్పుడు బాలకుడు, హరిమోహనుని చూడుమని చెప్పెను,

హరిమోహనుని కన్నుల యెదుట, సన్యాసి మనసు తెరువబడిన లెక్క పుస్తకమువలె నున్నది, అందులోని ప్రతి పుటయందు శ్రీకృష్ణుని పేరు వెయ్యిసారులు లిఖింపబడి యున్నది. సన్యాసి నిర్వికల్ప సమాధి

ద్వారమును దాటి సూర్యప్రకాశమునందు శ్రీకృష్ణుని సంగమునందు క్రీడ సల్పుచున్నాడు. కొన్ని దినముల నుండి సన్యాసి అన్నపానీయములు లేకయే కాలము గడుపుచు రెండు రోజులనుండి ఆకలి దప్పులచే శరీర బాధ అతనికి అధికమై యుండెను. ఇట్లు చూచి హరిమోహనుడు చెప్పెను.—"అరే, కన్నయ్యా, ఇదియేమి; మహాత్ముడు నిన్నింత ప్రేమించుచున్నాడు. ఐనను, అతడు క్షుధాపిపాసల ననుభవించు చున్నాడు; నీకు సాధారణునికి గల విచారముకూడ లేదు, ఈ నిర్జన వ్యాఘ్రిసంకుల అరణ్యమునం దతనికి ఆహారము నెవరిత్తురు.'' బాల కుడు చెప్పెను.—"నే నిచ్చెదను. మఱియొక వింతను చూడుము." అంతట, హరిమోహనుడు చూచుచుండగ, వ్యాఘ్రిము లేచి తన కాలి గోర్లచే సమీపమున నున్న వల్మీకకూటమును నొక దెబ్బకొట్టెను. అది పగిలి ఆ మంటికుప్ప నుండి వేలకొలది చెదలు బయటకువచ్చి కోప ముతో సన్యాసి శరీరముపై పరుగిడుచు కరువ చొచ్చెను. సన్యాసి ఆ యవస్థయందు ధ్యానమగ్నుడై, నిశ్చలుడై కూర్చొని యుండెను. అప్పుడు బాలకుడు మధుర స్వరముతో సన్యాసి చెవిలో "సఖే" యను శబ్దము పలికెను. సన్యాసి కన్నులు తెఱచెను; తొలుదొల్త, ఆ చెదలు కాటు, మోహజ్వాలామయి దంశనాను భవముగ స్ఫురింపలేదు; కాని. తొల్లి బృందావనమునందు శ్రీరాధికా చెవియం దూదబడిన శబ్దమును విశ్వవాంఛిత చిత్తమును హరించు పిల్లనగ్రోవి శబ్దములు, తానప్పు డప్పుడే వినుచుండినట్లు కనబడెను; దీని తర్వాత, ఆ వేలకొలది చెదలు తన శరీరమును కఱచుచుండుటను గుఱించిన తెలివి, తన శరీరము

వంకకు, ఆకర్షింపబడెను. సన్యాసి తన ఆసనమునుండి కదలక, విస్మయ పూర్వక మనస్సుతో, నిట్లు చెప్పెను, — "ఇదియేమి? ఇట్లెప్పుడును జరుగలేదే? ఓహో, శ్రీకృష్ణుడు నాతోచేరి క్రీడించుచున్నాడు. క్షుద్ర సమూహ కీటకరూపమున నన్ను కఱచుచున్నాడు. "కీటకములు కఱచు బాధ సన్యాసికి ప్రాణికముగా స్ఫురింప లేదనియు పైగా వాని కాటుబాధ తీవ్ర శరీరానందమునే అనుభవింప జేయుచుండెననియు, ఆ యానంద ముతో, శ్రీకృష్ణ నామమును పాడుటకును, తాళము వేయుటకును. నాటక మాడుటకును ప్రారంభించుటయు, చెదలు ఆతనినుండి దిగి మంటిలోనికి పరుగిడుటయును, హరిమోహనుడుచూచి ఆశ్చర్యముతో నడిగెను "అరే కన్నయ్యా, యీమాయయేమి?" బాలకుడు తాళము వేయుచు, ఒంటికాలి మీద రెండడుగులు వేసి నాట్యమాడుచు, నడచుచు నిట్లు చెప్పెను, — "నేను జగత్తుయొక్క ఏకమాత్రుడనగు ఐంద్రజాలికుడను, ఈ మాయను నీవు అర్థము చేసికొన జాలవు. ఇదియే పరమ రహస్యము. చూడుము. బాధయందు కూడ సన్యాసి నన్ను స్మరించుచున్నాడు; ఇంకను చూడుము."

కొంతసేపటికి సన్యాసి సహజస్థితికి వచ్చి కూర్చుండెను. అతని శరీరమున ఆకలి దప్పి బాధానుభవము, ప్రారంభమాయెను; అందుచే కలుగు వికారములను శరీరము అనుభవించుచుండినను. అతడు వికృతుడు కాలేదు, లిప్తుడు కాలేదు. ఈ విషయమును హరిమోహనుడు కనుగొనెను. ఈ సమయము నందు కొండ పైభాగమునుండి, ఎవ్వరో

వంశీరవ స్వరముతో "సఖే" అని యఅచుటచే, హరిమోహనుడు విస్మితుడయ్యెను. అది శ్యామసుందరుని స్వరమైయుండెను. ఆ తర్వాత కొండ శిఖరము వెనుకనుండి ఒక సుందరకృష్ణవర్ణ బాలకుడు స్థాలియందుత్తమ ఆహారమును పండ్లను తీసికొని వచ్చుచుండెను. హరిమోహనుడు హతబుద్ధియై శ్రీకృష్ణునివంకకు చూడసాగెను. బాలకుడుకూడ తన ప్రక్కననే నిలిచియుండెను. వచ్చుచుండు బాలకుడుకూడ అవికల శ్రీకృష్ణుడే యైయుండెను. ఆ రెండవ బాలుడక్కడికి వచ్చి సన్యాసికి వెలుతురు చూపి "చూడు, ఏమి తెచ్చియున్నా" నని చెప్పెను.

సన్యాసి నవ్వి యిట్లు మాట్లాడెను. — "వచ్చినావా : ఇన్నాళ్లు పఅకు ఆకలిలోనే యుంచితివా ? మంచిది. ఎప్పుడు వచ్చితివో, అప్పుడు నాయొద్ద కూర్చొని తినుము."

సన్యాసియును బాలకుడును, అ స్థాలియందుండు బండారమును తిన నారంభించిరి. ఆహారము సమాప్తమైనంతనే, బాలకుడు స్థాలినితీసికొని అంధకారమునందు విలీనమయ్యెను. హరిమోహను డేదేదో అడుగనుండెను, కాని శ్రీకృష్ణుడక్కడ నుండలేదు; సన్యాసియును లేడు, పులియును లేదు, పర్వతమునులేదు. ఇప్పుడతడు గొప్పమనుష్యుని మహలునందున్నాడు. అమిత ధనైశ్వర్యములు, స్త్రీలు, పరివారము, బ్రాహ్మణులకు భిక్షకులకునిత్యదానము లిచ్చుటయు, త్రికాల సంధ్య జరుపుచుండుటయు, శాస్త్రోక్త ఆచార విచారమును యత్నపూర్వకముగ రక్షించుచుండుటయు,

రఘునందనుడు ప్రదర్శించిన మార్గమున నడచుచుండుటయు చూచెను. అక్కడ, ఆదర్శపితరుడు, ఆదర్శ భర్త, ఆదర్శ పుత్రుడు నిత్యజీవిత మందలి తీవ్ర వేదనల ననుభవించుచుండిరి. కాని, ఆ రెండవ క్షణము నందే, ఆ భద్రమహాజనందు నివసించువారి అంతరమున లేశమాత్రమైన సద్భావముకాని ఆనందముకాని లేకుండుటచూచి భయభీతుడయ్యెను; వారు యంత్రమువలె బాహ్యాచారములను రక్షించుటయే పుణ్యమని తలంచుచుండిరి. ఇట్టిజీవనముచే, హరిమోహనునికి మొదట ఎంతఆనందము కలిగెనో, అంతబాధ యిప్పుడు కలిగెను. అతనికి దప్పికయినట్లును, నీరు దొరకనట్లును, ధూళి ఎగురుటచే నోటిలోనికి పోవునట్లునుచూచి, భయమయ్యెను. అందుచే, అక్కడనుండి పరుగెత్తి వేరొక గ్రామమునకుపోయెను, అక్క డొక ప్రకాండ మేడముందర, అపూర్వ జనసంఘమును, వారొనంగు చుండిన ఆశీర్వాద కోలాహలమును గాంచెను. హరిమోహను డాజన సమూహమునకు కొంచెము దగ్గర పోయెను; అక్కడ తీన్‌కౌడీశీలుడు వసారాయందు కూర్చొని రెండుచేతులతో దానము చేయుచుండెను. అక్కడనుండి వ్యర్థముగా వాపసు పోయినవారే లేరు, హరిమోహ నుడు నవ్వి, అటుయిటు నడచుచు, నిట్లు తలంచెను, — "ఈ స్వప్న మెట్టిది! తీన్ కౌడిశీలుడుకూడ దాతయా? ఆశ్చర్యము." ఆ తర్వాత నతడు తీన్‌కౌడీశీలుని మనస్సును స్పష్టముగా చూచెను. ఆ వృద్ధుని మనస్సునందు. లోభము. ఈర్ష్య. కామము. స్వార్థము మొదలగు గుణ లోపములు, కుప్రవృత్తులు ధ్వనించుచుండెను. పుణ్యము కొఱకును, యశము కొఱకును వాంఛితుడై, గర్వమునకు వశుడై, తీన్‌కౌడీశీలుడు

తన భావములను దాచియుంచెను; కాని హృదయమునం దవి లేక పోలేదు. ఈ సమయము నందే హరిమోహను నెవ్వరో పట్టుకొని పర లోకమునందు నడిపించు చుండిరి. హిందువులయు, క్రైస్తవులయు, ముసల్మానులయు, యునానీలయు, స్వర్గ నరకములను, పరలోకము నందు చూచివచ్చెను. దాని తర్వాత అతడిట్లు కనుగొనెను—తన యింటి యందే, తన పూర్వపరిచిత చినిగిన చాపమీద చినిగిన మైలగుడ్డలతో నుండిన పాన్పుపై, తాను కూర్చొనియుండెను; తన యెదుట శ్యామ సుందరుడు నిలుచుకొని యుండెను. బాలకు డిట్లు చెప్పెను,—"రాత్రి చాలకాలము గడచినది, నే నింటికి పోనియెడల నా యింటివారు నన్ను బెదరించెదరు, తన్నెదరు. కనుక అధికముగా మాట్లాడుట కవకాశము లేదు; సంక్షేపముగా, నింతమాత్రము చెప్పెద వినుము. నీవు స్వర్గ నరకముల జూచితివి; అవి యన్నియు స్వప్న జగత్తుయొక్క కల్ప నచే సృష్టియైనవి. మనుష్యుడు మరణానంతరమున స్వర్గమునకు లేక నరకమునకు పోయి గత జన్మముయొక్క భావము నక్కడ అనుభవిం చును. నీవు పూర్వజన్మమునందు పుణ్యవంతుడవై యుంటివి, కాని ఆ జన్మమునందు నీ హృదయమున ప్రేమకు స్థానము దొరకలేదు; మాన వుని కాని భగవంతుని కాని నీవు ప్రేమించలేదు. అందుచే ప్రాణము త్యజించిన తర్వాత స్వప్న జగత్తునందు గొప్ప మానవుని మహలునందు వాసముచేసి పూర్వ జీవితభావములను భోగము చేసితివి; మఱియు భోగము చేయుచు చేయుచు, ఆ భావముల నుండి నీ వలసట చెందితివి; నీ ప్రాణము వ్యాకులము చెందసాగెను; అక్కడ నుండి విడిచిపోయి

ఘాళిమయనరకము నందు వాసముచేయ నారంభించితివి ; అంత్యమున జీవితముయొక్క పుణ్యఫలము, ననుభవించి మఱల నీ జన్మమును పొందితివి. జీవనమందు చిన్నచిన్న నైమిత్తిక దానములను, నీరస బాహ్యవ్యవహారములను తప్ప, ఎవ్వరియొక్క లేమిడిని దూరము చేయుటకు గూడ నీవేమియు చేయలేదు, అందుచే, నీకీ జన్మమునం దింత అభావము కలిగియున్నది, ఈ సమయమునను నీవు చేయుచుండు నీరసపుణ్యమునకు కారణ మిదియే. కేవల స్వప్నజగత్తుయొక్క భోగముచే పాపపుణ్యములు క్షయమొందవు ; వాని సంపూర్ణ క్షయము, కర్మఫలమును పృథ్వియం దనుభవించుటచే కలుగును, తీన్‌కౌడీశీలుడు గత జన్మమునందు దానకర్ణుడై యుండెను. వేలకొలది జనుల ఆశీర్వాదముచే, ఈ జన్మమునందు లక్షాధికారి యయ్యెను. అతనికే వస్తువును కొదువలేదు ; కాని అతనికి చిత్తశుద్ధి కానందున అతృప్తకుప్రవృత్తులు, తొలగుటకు పాపకర్మల ద్వారా, అతడీ సమయమున తన్ను దా తృప్తి పఱచుకొనవలసిన అవసరము వచ్చినది. కర్మవాద మిప్పుడైనను నీ కర్థమైనదా ? ఈ కర్మవాదము బహుమాన దండనములు కావు ; ఇది అమంగళము ద్వారమున అమంగళమును; మంగళము ద్వారమున మంగళమును సృష్టి యగుటకు గల ప్రకృతిశాసనము. పాపము అశుభము; అందుచే దాని వలన దుఃఖము కలుగుచున్నది ; పుణ్యము శుభము ; అందుచే దానివలన సుఖము కలుగుచున్నది. ఈ వ్యవస్థ చిత్తశుద్ధి కొఱకు, అశుభవినాశము కొఱకు జరుగుచున్నది. చూడుము, హరిమోహనా, ఈ పృథ్వి, నా విచిత్రమయి జగత్తుయొక్క ఒక చిన్న

అంశము మాత్రమే యైయున్నది. మఱియు కర్మద్వారమున అశుభనాశ
నము కావించుటకు మీరిక్కడ జన్మ పొందుదురు; తర్వాత పాపపుణ్య
ముల సేతలనుండి పరిత్రాణమును పొంది ప్రేమరాజ్యమునందు పదా
ర్పణ మొనరించునపుడు, మీరీ కార్యములనుండి విముక్తు లగుదురు.
వచ్చే జన్మయందు నీకు ముక్తి గలుగవచ్చును. నా ప్రియసోదరియగు
శక్తిని, ఆమె సహచరియగు విద్యను, నీయొద్దకు పంపెదను; కాని
చూడుము, ఒక నియమము మాత్రము అందున్నది. నీవు నాలీలయందు
సహచరుడవు కావలెను. ముక్తుడవై యూరకమాత్ర ముండకూడదు.
మఱి అది నీ కిష్టమేనా?" హరిమోహను డిట్లు చెప్పెను,—"అరే,
కన్నయ్యా, నీవు నాకు చాల ఉపకారము చేసితివి; నిన్ను కౌగిలించు
కొనుటకు చాల యిష్టమగుచున్నది! ఈ జీవితమందు నా కిప్పుడే
వాసనయు లేకుండపోవుచున్నవని నా కర్థమగుచున్నది."

బాలకుడు నవ్వుచూ చెప్పెను, — "హరిమోహనా కొంచెమే
నియు అర్థము చేసికొంటివిగదా?" హరిమోహనుడు జవాబుచెప్పెను,—
"ఎందు కర్థముకాలేదు." దీని తర్వాత కొంచెమాలోచించి మఱల
చెప్పెను. "అరే కన్నయ్యా, నీవు నన్నింకను మోసగించియుంటివి.
అశుభమును నీవేల సృష్టించితివి. దీని విషయమున, నీవేమియు ప్రతి
పాదన చేయలేదు, ఇట్లుచెప్పి, అతడు బాలకుని చెయ్యి పట్టుకొనెను.
బాలకుడు తన చేతిని విడిపించుకొని, బెదరించుచు నిట్లు చెప్పెను,—

దూరముండుము; వచ్చో, ఒక గంట కాలములోనే, నా సమస్త గుప్త వచనములను వినుటకు కోరుచున్నావో ?'' ఇంతమాత్రము చెప్పి, బాలకుడు దీపమును హఠాత్తుగా ఆర్పివేసి, హరిమోహనుని నుండి కొంచెముదూరము పోయి నవ్వుచూ చెప్పెను, ''చూడుము, హరిమోహనా, కొఱడాతో కొట్టుట పూర్తిగా మఱచితివి; అందుచే, నీ కౌగిలిలోనికి నేను రాలేదు. నీవు బాహ్యదుఃఖముచే క్రుద్ధుడవై నన్ను, బాగుగా కొట్టుట కేల ప్రయత్నించలేదు ? నీయందు నాకు లేశమాత్రమైనను విశ్వాసము లేదు.''

హరిమోహను డంధకారమునందు తన చేతిని చాచెను; బాలకుడు మఱింతదూరముపోయి యిట్లు చెప్పెను — ''లేదు, ఈ సుఖమును నీకు మఱియొక జన్మమునందు బాకీయుంచి విడిచెదను. మంచిది నే నింక పోయెదను.''

ఇట్లుచెప్పి, బాలకుడు చీకటిరాత్రియం దదృశ్యుడై పోయెను. హరిమోహను డాతని నూపురధ్వనిని వినుటకు లేచెను; లేచి యిట్లు తలంచెను, ''ఎట్టి స్వప్నము చూచితిని! నరకమును స్వర్గమును చూచితిని. మఱియు భగవానుని 'నీవు' అని చెప్పితిని, చిన్నబాలకుడని తలంచి నిందించితిని, దూషించితిని! పెద్దపాపమున కొడిగట్టుకొంటిని!

కానిమ్ము, ఏదిఏమైనను, ఒక పూర్వాభూత శాంత్యానుభవము నాప్రాణము నందు స్థిరపడినది.'' హరిమోహను డిప్పుడు ఆ కృష్ణవర్ణ బాలకుని యొక్క మోహినీమూర్తిని ధ్యానించుచు. మధ్యమధ్య. ''ఎంతటి సౌంద ర్యము ఎంతటి సౌందర్యము'' అని చెప్పసాగెను.

*
* *

స మా ప్త ము

# శ్రీఅరవిందాశ్రమ తెలుగు గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | గీతావ్యాసములు మొదటిభాగం | | రు\|\| | 10. 00 |
| 2. | ,, రెండవభాగం | | ,, | 12. 00 |
| 3. | యోగసమన్వయము (రెండుభాగములు) ఒక్కొక్కటి | | | 8. 00 |
| 4. | ప్రశ్నోత్తరములు— శ్రీమాత— 1950-51 | నెం. 7 | ,, | 15. 00 |
| 5. | ప్రశ్నోత్తరములు— శ్రీమాత— 1953 | నెం. 9 | ,, | 12. 00 |
| | రెండవభాగం | నెం. 10 | ,, | 12. 00 |
| 6. | ప్రశ్నోత్తరములు— శ్రీమాత— 1957 | నెం. 17 | ,, | 12. 00 |
| 7. | ప్రశ్నోత్తరములు— శ్రీమాత— 1958 | నెం. 18 | ,, | 10. 00 |
| 8. | ప్రార్థనలు - ధ్యానములు | | ,, | 15. 00 |
| 9. | నిగూఢవేదరహస్యము | | ,, | 20. 00 |
| 10. | శ్రీఅరవింద సూక్తులు : 1 వ భాగము | | ,, | 8. 00 |
| 11. | ,, ,, 2 వ భాగము | | ,, | 9. 00 |
| 12. | శ్రీ దుర్గాస్తోత్రము | | ,, | 0. 75 |
| 13. | పరమరహస్యం | | ,, | 1. 50 |
| 14. | భారతావని | | ,, | 1. 50 |
| 15. | మాతృశ్రీ | | ,, | 1. 50 |
| 16. | శ్రీమాతారవిందులను గురించి శ్రీఅరవిందులు | | ,, | 2. 50 |
| 17. | యోగమూలము | | ,, | 7. 00 |
| 18. | జగన్నాథుని రథము | | | |

---

దొరుకు స్థలము :—

S A B D A
Sri Aurobindo Ashram
Pondicherry–605 002

